# హేతువాదం

## సామాజిక విప్లవ మాసపత్రిక


| | | |
|---|---|---|
| సంపుటి 4 | ఎడిటర్ : | అక్టోబరు 1984 |
| సంచిక 6 | యస్. వి. రావు | వెల రు. 2-00 |


కుల, మత మౌఢ్యంనుండి బయటపడని దళిత పోరాటం

భూమి ఎలా పుట్టింది?

లౌకిక శక్తులు ఏకం కావాలి

మత రాజకీయ కుట్రలను ఎదిరించాలి!


:నిర్వహణ:

...ప్రదేశ్ హేతువాద స...

# హేతువాదం
వరసరావుపేట - 522 601.

## సంపాదక వర్గం
గౌరవ సంపాదకులు :
కత్తి పద్మారావు

సంపాదకులు :
యస్. వి. రావు

సహాయ సంపాదకులు :
సయ్యద్ నశీర్ అహమ్మద్

సభ్యులు :
తోటకూర వెంకటేశ్వరరావు
కఠారి ప్రభాకరరావు
సత్యమిత్ర
అప్పుతు సుబ్బారావు
వల్లంపట్ల నాగేశ్వరరావు
యన్. సాంబశివరావు
బి. వి. కె. పూర్ణానందం
గార్లపాటి కోటేశ్వరరావు

మేనేజర్ : వి.యస్.యన్. మూర్తి

విడి ప్రతి : రు. 2-00
సంవత్సర చందా : రు. 20-00
జీవిత చందా : రు. 200-00

యం. ఓ. ద్వారా గాని లేక
డి. డి. ద్వారాగాని పంపవచ్చు.

ఎడిటర్: హేతువాదం
నరసరావుపేట - 522 601.


# విషయసూచిక



గమనిక : 1984 మార్చి సంచికలో ప్రచురించిన "మతము-శాస్త్రీయ దృక్పధం" అనే వ్యాసంలో కొంత భాగం పొరపాటున పునర్ముద్రితం అయినందుకు చింతిస్తున్నాం పాఠకులు గమనించ మనవి.

—ఎడి.

# హేతువాదం

[సామాజిక విప్లవ మాస పత్రిక]




## ఫిరాయింపులకు పరిష్కారం ప్రజా చైతన్యమే

పరాయి పాలన అంతమయినందుకు ఆనందించాం. స్వపరిపాలన వచ్చినందుకు పరవశించాం. మన జాతిని మనం పునరుద్ధరించుకునే అవకాశం లభించినందుకు సంతసించాం. నవభారత రాజ్యాంగం ఉదయించినందుకు ఉబ్బిపోయాం. వయోజన ఓటింగధికారం పొందగలిగినందుకు పొంగిపోయాం. ప్రజాస్వామ్యం ప్రాతిపదికగా విధానసభలేర్పడినందుకు ఉత్తేజితులమయ్యాం. మన ప్రజా ప్రతినిధులు మనకొరకే అంకితమవుతారని ఆశించాం. సోషలిజమే మన గమ్యమని గర్వించాం. అఖండ భారతావని అందరికి ఆదర్శప్రాయం కాగలదని అబ్బురపడ్డాం.

కాని యివన్ని కలలుగానే కరిగిపోయాయి. ఆశలుగానే మిగిలిపోయాయి. పరపీడన వదిలిందనుకుంటే స్వపీడన తగులుకుంది. బహిర్గత శక్తులకంటే అంతర్గత శక్తులే ప్రమాదకరంగా పరిణమించాయి. స్వరాజ్యం నియంతృత్వ శక్తులపాలయింది. ఫాసిస్టు నియంతృత్వ శక్తులే పాలకులయ్యారు. అధికార దాహం హద్దులు దాటింది. ఫ్యూడల్ భూస్వామ్య శక్తులదే పెత్తనమయింది. కుల మత శక్తులే సామంతులయ్యారు. అవినీతి, అధర్మం ఆదర్శాలయ్యాయి. ప్రజాస్వామ్యం ధనస్వాముల గడపలో ఊడిగం చేస్తుంది. నవభారత రాజ్యాంగానికి దోపిడీ వర్గాలే సర్వాంగాలుగా పనిచేస్తున్నాయి. ఆశయాలు, ఆదర్శాలు అసమర్థుని సందేశాలుగా మిగిలిపోయాయి. ఎత్తులకు పై ఎత్తులు, వ్యూహాలకు ప్రతి వ్యూహాలు వేయగలిగినవారే గొప్ప రాజకీయ పండితు

లుగా భావించబడుతున్నారు. గంటలో మాట మార్చే వాడికంటే క్షణంలో మాట మార్చేవాడే గొప్ప నాయకుడవుతున్నాడు. సిద్ధాంతాలకు అంకితమై సూత్రాలకు కట్టుబడి క్రమశిక్షణే ప్రాణంగా, ప్రజాసేవే ఊపిరిగా, త్యాగమే లక్ష్యంగా, ఆచరణే ఆదర్శంగా భావించి నిజాయితీగా పనిచేసేవారు రాజకీయాలు తెలియని అమాయకులుగా ఎంచబడుతున్నారు. సమాజాన్ని మార్చటానికి ప్రయత్నించటం అవివేకమంటున్నారు. అర్థం-అధికారం యివి రెండే త్రికాల సత్యాలంటున్నారు. ఈ రెంటిని సాధించటానికి ఏం చేసినా తప్పు లేదంటున్నారు. ఇవి రెండు పొందలేనివాడు పనికిమాలినవాడంటున్నారు. లక్ష్య శుద్ధ అరుదయిపోయింది. కర్తవ్యం నిష్ఠ కరువయిపోయింది. పదవీ వ్యామోహం పెరిగిపోయింది. అధికారం కొరకు కుమ్ములాటలు ప్రారంభమయ్యాయి. ప్రజా ప్రతినిధులు సంతలో సరుకుల కంటె హీనమయ్యారు. పెట్టుబడీదార్ల అంగట్లో బానిసలుగా నోట్ల కట్టలకు సిగ్గు బిడియం లేకుండా అమ్ముడుబోతున్నారు.

ఈ కారణంగానే మన దేశంలో ఫిరాయింపులు ప్రహసనం ప్రారంభమయింది. పార్టీలు మార్చగలిగిన వారికి గిరాకి పెరిగింది. బూర్జువా రాజకీయ సంస్కృతి ఈ జాడ్యానికి ప్రోత్సాహమిచ్చింది. హరియానా మాజీ ముఖ్యమంత్రి భజన్ లాల్ ఫిరాయింపుదార్లకు చక్రవర్తిగా ప్రసిద్ధి చెందాడు. అధికారమే పరమ ధ్యేయంగా భావించి కాసుకు దాసులయిన బూర్జువా ప్రజా ప్రతినిధులు తమనునమ్ముకున్న ప్రజలకు ద్రోహంచేసి చొక్కాలు మార్చినట్లు పార్టీలను మార్చటానికి బరితెగించారు. నీతి నియమాలు ప్రజలకవసరమన్నారు. ప్రజాసేవకు పదవులవసరమన్నారు. పార్టీలు మారితేనే పదవులన్నారు. చివరికిదేశసంఘసేవకు గీటురాయి అయింది. ఫిరాయింపుల చరిత్రకు ప్రాముఖ్యత పెరిగింది మంత్రి కాగలిగితేనే మొనగాడన్నారు. తిరిగి ప్రజా విశ్వాసం పొందగలవన్నారు. కాని వాడు రాజకీయాలకు అన్‌ఫిట్ అన్నారు. అయినవారికి హారతులన్నారు. యింకేముంది ఫిరాయింపులలో మన దేశం రికార్డు స్థాపించింది. ఎన్నికలాధికారి యిచ్చిన సమాచారం ప్రకారం 1967-73 మధ్య కాలంలో 2700 పార్టీ ఫిరాయింపులు జర్గాయి. ఊసరవెల్లుల్లా రంగులు మార్చిన 15 మంది ప్రజా ప్రతినిధులు ముఖ్యమంత్రులయ్యారు. 212 మంది ఫిరాయింపుదార్లు మంత్రి పదవులు పొందగలిగారు. హరియానాలో యం.యల్.ఎ.లందరు ఫిరాయింపులతో మంత్రులయినట్లు గుర్తు. ఫిరా

యింపుల నాటకీయంలో గడించిన లక్షలతో తిరిగి పార్టీ టిక్కెట్లు సంపాదిస్తున్నారు. ఎన్నికలలో గెలుస్తున్నారు.

తన వంశ నిరంకుశ పరిపాలన శాశ్వితంగా కొనసాగటానికి యింతకు మించిన ఉపాయం లేదనుకుంది కాంగి అధినేత. వాతావరణ కాలుష్యం దేశానికి ప్రమాదం కావచ్చుగాని రాజకీయ కాలుష్యం తన సొంత రాజకీయ వాతావరణానికి శుభోదయమనుకుంది. అందుకే ఫిరాయింపుల క్షుద్రవిద్యను కల్పివేటు చేయటానికి పూనుకున్నది. ఈ విద్యతో ప్రతిపక్ష భక్షణ సులభమనుకున్నది. తనకు వ్యతిరేక ప్రజా ప్రభుత్వాలను కూల్చే కర్తవ్య భారాన్ని రాష్ట్రాలలోని రాజభవన్‌కు అప్పగించింది. మానసిక బలహీనతల మీద పరిశోధన చేయమన్నది. పదవినాసించి గులాంగిరికి సిద్ధమయ్యే వ్యక్తిని ట్రాప్ చేయమన్నది. వంచనా శిల్పంలో దక్షత కలిగి నమ్మక ద్రోహం చేయగలిగినవాడే అర్హుడన్నది. అతనే పల్లకి మోయటానికి ఫిట్ అన్నది. అతనే ప్రజాస్వామ్యాన్ని నడిబజారులో ఖూనీచేయగలడన్నది. ఆంధ్రదేశంలో ఈ కర్తవ్యాన్ని రాంలాల్ ప్రభు భక్తితో నిజాయితీగా నిర్వహించాడు. అయితే ఈ ప్రతిపక్ష ప్రభుత్వాలను పడగొట్టే కుట్ర ఈనాడు భాస్కరరావుతో ప్రారంభమయినదికాదు. 1952లో ఉమ్మడి మద్రాసులోను, 1959లో కేరళలోను, 1967లో పశ్చిమబెంగాల్‌లోను, 1970లో ఉత్తరప్రదేశ్‌లోను, యిటీవల సిక్కింలోను, కాశ్మీరులోను విధానసభలో మెజారిటీవున్న నాయకుని కాదని మైనారిటీ నాయకునికి పట్టం కట్టటం జరిగింది. కాంగియేతర బూర్జువా పార్టీలుగూడ ఫిరాయింపులకు అతీతం కాదు.

తెలుగుదేశంలోని కొంతమంది ప్రజా ప్రతినిధులు కాంగి సంస్కృతి ముద్దు బిడ్డలే. కాంగినుండి ఫిరాయించిన నాదెండ్ల భాస్కరరావు తెలుగు దేశం ముఖ్య నిర్మాతలలో ఒకరు. ఆనాడు కాంగి గుడారంలో పదవి దొరకక ఫిరాయించిన భాస్కరరావును తెలుగుదేశం అధినేత ఆలింగనం చేసుకున్నాడు. పదవి కాంక్షతోనే కాంగి తెప్పను తగలేశాడు. తిరిగి ఆ పదవీ కాంక్షతోనే తెలుగుదేశం తెప్పను ముంచేశాడు. దీనిలో ఆశ్చర్య పడవలసినదేముంది? పరస్పరం నిందించుకోవలసినదేముంది? యింత జరిగిన తరువాతగూడ ఫిరాయింపులను ప్రోత్సహిస్తున్న తెలుగుదేశం వైఖరికే ఆశ్చర్యపడాలి! ఆయారాం గయారాం శకం ముగిసింది. ఆయా భీం గయా భీం శకం ప్రారంభమయింది.

అందుచేత సైద్ధాంతిక ప్రాతిపదికమీద క్రమశిక్షణాయుతంగా శిక్షణ యివ్వబడ్డ కార్యకర్తలు పునాదిగా నిర్మాణంకాని ప్రతి రాజకీయపార్టీ ఫిరాయింపుల ప్రహసన సంక్షోభానికి గురికావటం అనివార్యం.

హేతు దృష్టి, దేశభక్తి, లక్ష్యశుద్ధి, సిద్ధాంత అవగాహన, సామాజిక స్పృహ, నిజాయితీ వున్నవారు ఈనాడు ఎన్నికలలో పోటీ చేయటానికి అనర్హులుగా భావించబడుతున్నారు. కుల బలం, ధన మదం, ఎత్తులు, జిత్తులు, కుయుక్తులలో ఆరితేరి రాజకీయ చదరంగం ఆడగలిగి ఫిరాయింపులను సైద్ధాంతిక ముసుగుతో సమర్థించుకోగల చాకచక్యం, వంచనా శిల్పం కలిగిన వారిని మాత్రమే వెతికితెచ్చి ఎన్నికలలో టిక్కెట్లు యిస్తున్నారు. సామ, దాన, భేద, దండోపాయాలతో కుల, మత, వర్గ ధన ప్రలోభాలతో అమాయకులయిన ఓటర్లను మోసగించి ఎన్నికలలో గెలుస్తున్నారు. తిరిగి కాసులకు కక్కుర్తిపడి, మానాభిమానాలు మరచి, నమ్మిన ప్రజలను నట్టేట ముంచి పదవికోరకు ఫిరాయిస్తున్నారు.

ఈలాంటి వారితో రాజకీయాలు నడుస్తున్నప్పుడు ప్రజాస్వామ్యం నడి బజారులో ఖూనీ కావటం అసహజమూ కాదు. రాజ్యాంగానికి పట్టపగలే మానభంగం జరగటం ఆశ్చర్యమూకాదు. ప్రజా దృష్టిలేని ప్రజా ప్రతినిధులనుండి యింతకంటే ఏం ఆశించగలం? అందుకే ఈనాడు విధాన సభలు మయ సభలుగా మారుతున్నాయి. పైరవీకార్ల నిలయాలుగా వి సిల్లు తున్నాయి ప్రజా సమస్యలను గురించి చర్చించవలసిన ... పరస్పరం దూషించుకుంటూ ముష్టి యుద్ధాలకు తలపడుతున్నాయి. చేతులు కలుస్తున్నాయి. మైకులిరుగుతున్నాయి. దేశాన్ని, ప్రజలను తీర్చి దిద్ద వలసిన శాసన సభలు నిర్జీవమై నిర్వీర్యమై బాతా ఖానీ కేంద్రాలుగా మారుతున్నాయి. అందుచేత ఈ స్థితి భాస్కరరావుతో పోయేది కాదు. రామారావుతో మారేది కాదు ఇందిరమ్మ ఓటమితో విరగడయ్యేది కాదు. ఇది బూర్జువా రాజకీయ వ్యవస్థయొక్క విశిష్ట లక్షణం. దీనిని మార్చగల శక్తి హేతు దృష్టిగల జన శక్తికి మాత్రమే వుంది. ఈ జన శక్తిని విప్లవం దిశగా మల్చ గల్గిన శక్తి మార్క్సిస్టు సైద్ధాంతిక అవగాహన, సామాజిక దృక్పథం కల్గిన మేథావులకు మాత్రమే వుంది. వీరందరి ఐక్యతే ఈ స్థితికి పరిష్కారం.

★

# వేదాలు భారతీయమా?

— కత్తి పద్మారావు

( గత సంచిక తరువాయి )

## అగ్ని

అగ్నిమీళే పురోహితం। యజ్ఞస్యదేవమృత్విజమ్
హోతారం రత్నధా తమమ్॥ (ఋ-1-1)

పురోహితునివలె యజ్ఞమును నడిపించువాడును, (దేవతలను) పిలుచుకొని వచ్చువాడును, ఋత్విజుడై (యజ్ఞమును సాధించువాడును) రత్నములను (యజ్ఞఫలములను) ధరించువాడునగు అగ్ని దేవుని స్తుతించుచున్నాను.

అగ్నినా రయి మశ్నవ త్పోషమేవ దివేదివే। యశసం
వీరవత్తమ్॥ (ఋ-1-3)

ఆ యగ్నిచేతనే (యజమానుడు) ధనమును పొందుచున్నాడు. కీర్తిని, వీరులైన పుత్రభృత్యులను పొందుచున్నాడు.

ఉపత్వాగ్నే దివేదివే దోషావ స్తర్ధియా వయమ్।
నమో భరంత ఏమసి॥ (ఋ-1-8)

ఓ యగ్నీ! ప్రతి దినమును రాత్రింబవళ్ళు మనస్సుతో నిన్ను నమస్కరించుచున్న నేము నీ సమీపమునకు వచ్చుచున్నాము.

సనః పితేవ సూనవేగ్నే సూపాయ నోభవ॥ సచస్వానః
స్వస్తయే॥ (ఋ-1-9)

ఓ యగ్నీ! కుమారుని కొఱకు తండ్రివలె నీవు మా కొరకు శుభమును గూర్చు వాడవును, మా మేలు కొఱకై ప్రయత్నించువాడవునుగమ్ము.

అగ్నిని వారానాడు ఈ విధంగా పూజించారు. అగ్ని ఆనాడు వారి జీవితంలో ప్రధాన పాత్ర వహిస్తుంది. ప్రతి యింటిలోను అగ్ని నిత్యం జ్వలిస్తూ వుండేది. ఆ విషయాన్నే ఋగ్వేదంలో-

అశ్వో న క్రందన్ జనభిః సమిధ్యతే
వైశ్వానరః కుశికేభిర్యుగేయుగే।
సనో అగ్నిః సువీర్యం, స్వశ్వ్యం దధాతు
రత్నమమృతేషు జాగృతిః॥

వైశ్వానర అగ్ని అశ్వమువలె సకిలిస్తూ, కుశికులచే యుగ యుగము లందు (సదా) ప్రజ్వలింపబడుతున్నది. అమృతములందు జాగరూకమైన ఆ అగ్ని మాకు బలమును, మంచి అశ్వములను, మంచి రత్నములను ప్రసాదించుగాక.– అని విశ్వామిత్రుడు తన వంశీకులను చెప్పుకొన్నాడు. ఇంకా భరద్వాజుడు అగ్ని మహిమనుగూర్చి చెప్పాడు.

ఆ వ్రత పాలకుడగు అగ్ని పరమ వ్యోమమందు పుట్టి వ్రతములను కాపాడుతున్నాడు. ఆ సుకర్ముడు ఆకాశాన్ని కొలుస్తున్నాడు. వైశ్వానర అగ్ని తన మహిమచేత నాకమును (స్వర్గమును) తాకుతున్నాడు.

మహిషులు (గొప్పవారు) అంతరిక్షమందు అతన్ని ధరించారు. విశులు (ప్రజలు) పూజ్యుడైన రాజు అని గౌరవించారు.

వివస్వాన్ (సూర్యుడు) దూతయగు వైశ్వానర అగ్నిని వాయువు దూరమునుండి తెచ్చి ధరించినది.

భరద్వాజుడు అగ్నిని, "యుగయుగాల అమరదూత" అన్నాడు.

త్వాం దూతమగ్నే అమృతం యుగే యుగే
హవ్యవాహం దధిరే పాయుమీడ్యం
దేవాసశ్చ మర్తాసశ్చ జాగృవిం విభుం
విశ్పతిం నమసా నిషేదిరే॥

హవ్యవాహకుడును, రక్షకుడును, పూజ్యుడును అయిన ఓ అగ్నీ! అమరదూతవయిన నిన్ను ప్రతి యుగంలోను ప్రజలు ధరిస్తారు. నీవు విభుడవు, జాగరూకుడవు, ప్రజాపతివి. నిన్ను దేవులు, మానవులు నమస్కరించి స్థాపన చేస్తారు.

విశ్వామిత్రుడుకూడా అగ్నిని స్తుతించాడు. హవిస్సు కల్గిన ధనము కోరుచున్న కుశికులైన మేము సత్యానువర్తియు, స్వర్గ వేత్తయు, సుదాతయు, అశ్వసారథియు, అణు (సూక్ష్మ) రూపియు, అయిన వైశ్వానర అగ్నిని మనస్సుతో తెలుసుకొని ఆహ్వానిస్తున్నాం. (3-26-1)

సకిలిస్తున్న స్త్రీలద్వారా వెల్గించబడిన వైశ్వానర అగ్ని కుశికులచే యుగయుగములనుండి పోషింపబడుచున్నాడు. అమరులందు జాగరూకు డయిన అగ్ని మాకు అందమైన వీరులను, అశ్వములను, రత్నములను, ఇచ్చుగాక.

అగ్ని రస్మి జన్మనా జాతవేదా ఘృతం మే
చక్షురమృతం మే ఆసన్
అర్కస్త్రిధా తూ రజసో విమానోఽజస్రో
ఘర్మో హ విరస్మినామ॥ (3-26-7)

నేను అగ్నిని పుట్టుకతోనే అంతా ఎరుగుదును. నెయ్యి నా కన్ను. అమృతం నా నోటిలో ఉంది. నేను త్రివిధ అర్కుడను (సూర్యుడను). లోకాలను కొలిచేవాడను. సదా వేడిగావుండే వాణ్ని. హరి పేరు కలవాణ్ని, అగ్నిని – వాయుదేవుడు అగ్నిని స్తుతించాడు.

"పిడుగుపాటుతో చనిపోయేముందు నీవు, రుద్రుడును, ద్యావపృథ్వీ హోతలకు నిజమైన యజమానియు, సువర్ణ రూపుడును, యజ్ఞరాజును అగు అగ్నిని రక్షకునిగా చేసికొనుము." (4-3-1)

"ఓ అగ్నీ! పతిని కోరుతూ సుందరమైన వస్త్రముల నలంకరించు కొన్న పత్నివలె మేము నీ కొరకు ఈ స్థానమును ఏర్పాటు చేస్తున్నాం. తేజోవంతుడవై యెదుటకు వచ్చి, యిక్కడ కూర్చొనుము. స్వపాకము వెనుక వైపున వున్నది."

సప్తసింధులోని భరతుని సంతానములయిన దేవశ్రవా, దేవవాతులు అగ్నిని స్తుతించుచున్నారు. (3-23-4)

ఓ అగ్నీ! మేము అన్న స్థానము కల ఉత్తమభూమియందు మంచి దినములకై నిన్ను స్థాపన చేస్తున్నాము. నీవు దృషద్వతీ (ఘగ్గరా) ఆపయా (మారకుండ) సరస్వతీ తటమున ధనయుక్తుడవై ప్రజలందు ప్రకాశించుము.

కుశికులు ప్రతి యింటిలోనూ అగ్నిని సేవిస్తున్నారు, (3-29-15) మాయొక్క ప్రతి యింటిలోనూ అగ్ని ప్రతిష్టితమైనది. అందరు అగ్ని దేవుని భక్తులు అని సరస్వతీ ఉపత్యకలో ఉన్న ఈ ఆర్యులు గర్వపడేవారు.

ఈ విధంగా అగ్నిని పూజించడం జరిగింది. అగ్నిని పురోహితుడుగా, అగ్నినే దేవతగా, యజ్ఞఫలముల నిచ్చువాడిగా అనేక విధముల కొనియాడారు. ఆనాడు అగ్నిని మానవుడు కనుగొని వేల సంవత్సరా లయింది. మానవుడు ఆటవిక దశను దాటే స్థితిలో కనుగొనబడింది. ఆర్యులు ఇంకా నిప్పును ధ్యానించే స్థితిలోనే వున్నారంటే, ఆర్యుల హరప్పా సంస్కృతికి చాలా వెనకబడి వున్నారు. రాహుల్ సాంకృత్యాయన్‌గారు ఈ విషయమై ఇలా అంటున్నారు.

"ఆర్యులు రాకముందు భారతదేశంలో, వారికంటే ఎంతో ఉన్నతమయిన, ప్రాచీనమయిన సంస్కృతి యిక్కడ వుండేది. ఆ సంస్కృతి యొక్క అవశేషాలు మొదట్లో హరప్పా, మొహంజదారో ప్రదేశాలలో దొరికినవి. ఇప్పుడు గంగా, యమునా తీరాలలోనూ, సౌరాష్ట్రాది ప్రదేశాలలోనూ దొరుకుతున్నవి సప్త సింధులోని ఆర్యులకు తమ పశుపాలక సంస్కృతిలోను, జీవితంలోను, అంటిపెట్టుకొని వుండాలనే గట్టి పట్టు వుండకపోతే వారు ఆ నగర సంస్కృతికి అధిపతులయ్యేవారు."

("ఋగ్వేద ఆర్యులు" 7వ పేజీ)

పశుపాలక సంస్కృతికి సంబంధించిన ఆర్యులు, అగ్ని మొదలగు దేవతలను ఉపాసించిన తీరునుబట్టి, వారి ఆలోచన, సంస్కృతి వారు వచ్చేనాటికి భారతదేశంలోవున్న సంస్కృతికంటె గొప్పదేమీ కాకపోగా, వారు ఉపాసించిన తీరునుబట్టి ప్రకృతి శక్తులనుగూర్చి వారికి ప్రాథమిక జ్ఞానంకూడా వున్నట్లు కన్పించదు. అందుకే "వేదాలు తత్త్వశాస్త్రంకాదు, శాస్త్రంకాదు, చరిత్రకాదు, కవిత్వమూకాదు. వేదాలు భారత భూమిలో పుట్టినవి, అందులో సమస్త విజ్ఞానముంది" అనే మతవాదుల వ్యాఖ్యానం. అయితే పరిశీలనలో వేదాలు భారతదేశపు రచనలు కాదని, వేదాలలోని భావాలకుగాని, వేదాల భాషకుగాని, భారతదేశానికి వెలుపల వారితోనే ఎక్కువ సంబంధాలున్నట్లు తెలుస్తుంది.

"ఋగ్వేదాన్ని నిర్ణయించేటప్పుడు ఋగ్వేద ఆర్యులకు కేవలం భారతదేశంతోనేకాదు, భారతదేశానికివెలుపలకూడా భాషలోను, భావాలలోను, వారికి సంబంధమున్నవారు కలరను సంగతి గుర్తుంచుకోవాలి. భారతదేశానికి వెలుపలున్నవారిలో అందరికంటే వారికి దగ్గరివారు ఇరానీయులు. "అదృష్ట పశాత్తు" వారి మతాచారాలను తెలుసుకొనుటకు "అవెస్తా" ఉంది.

షార్శ్మి మతస్థులు ఇప్పటికీ ఉన్నారు. వేదాన్ని, అవెస్తాను పోల్చుకొని అధ్యయనంచేస్తే, భాషలోను, మతంలోను, ఆర్యులు, పారశీకులు, ఒకరికొకరు చాల దగ్గర అని తోస్తుంది. పారశీకుల తర్వాత "స్లావుల"తో ఆర్యులకు దగ్గరి సంబంధముంది. "స్లావు" శబ్దం "శ్లావు" (శకులు, లావులు) శబ్దం యొక్క అపభ్రంశ రూపం. రష్యనులు, ఉక్రెనియనులు, బైలో రష్యనులు, బల్గారులు, యుగోస్లోవులు, చెకోస్లోవులు, పోలులు - అందరూ స్లావు జాతివారే.

"పారశీకులు, శకులు తర్వాత భారతీయ ఆర్యులకు లిథువానియను లతో దగ్గర సంబంధం కలదు. ఈ రెండు భాషలు సొంత చెల్లెళ్లు."

"తర్వాత పశ్చిమ ఐరోపాలోని ప్రాచీన గ్రీకు, లాటిను భాషలకు, నేటి జర్మను, ఫ్రెంచి, ఇంగ్లీషు మొదలయిన భాషలకూ వైదిక భాషలతో సంబంధముంది."— (ఋగ్వేద ఆర్యులు - రాహుల్ సాంకృత్యాయన్)

భారతీయ భాషా కుటుంబాలపై సంస్కృత ప్రభావం వుందేకాని జన్యు జనప భావం లేనేలేదు. ఋగ్వేద రచయితలు భారతీయులు కాక పోవడమేగాక భారతీయ సింధూ సంస్కృతిని వీరే ధ్వంసం చేసినట్లుగా చరిత్రకారులందరూ వివరిస్తున్నారు. ఈ విషయమై దేవి ప్రసాద్ చటో పాధ్యాయ వివరణ ఇలా ఉంది....

"ఋగ్వేదాన్ని సంకలనం చేసినవారు, భారత దేశంలో ప్రవేశించి సింధులోయ నాగరికతా చిహ్నాలయిన ఆయా పట్టణాలను ధ్వంసం చేసినా రనే విషయాన్ని పురాతన వస్తు తత్త్వ శాస్త్రజ్ఞులు బాగా విశ్వసిస్తున్నారు. అనేకమయిన యుద్ధాలలో ఆరితేరిన యుద్ధ వీరుడగు ఇంద్రుని అతి శయోక్తులతో "త్రిపురాంతకు"డని పొగడిన పొగడ్తలు ఋగ్వేదంలో అనేకం కన్పిస్తాయి. ఈ సింధు లోయలోనే ఆటవిక జాతివారు నాశనం చేసిన పట్టణాల శిధిలాలుకూడా లభిస్తున్నాయి." (భారతీయ తత్త్వశాస్త్రం - సులభ పరిచయం-పేజీ 55) దీనినిబట్టి వేదాలు భారతీయ సంస్కృతీ విధ్వంసకుల గ్రంథాలేకాని భారతీయ సంస్కృతీ రక్షకుల రచనలు కావనేది తెలుస్తుంది.

ఈ విధంగా మనం వేదాలను పరిశీలించినట్లైతే ముఖ్యంగా వేద వాఙ్మయానికి మూలమయిన ఋగ్వేదాన్ని పరిశీలించినట్లైతే భాషలోకాని

[మిగతా 13వ పేజీలో]

# కుల, మత మౌఢ్యంనుండి బయటపడని దళిత పోరాటం

—డా॥ కె. విల్సన్
ఫిలాసఫీ రీడర్, ఉస్మానియా యూనివర్సిటీ - హైదరాబాద్.

దళిత సమస్యని కొందరు కేవలం సాంఘికమైనదని, మరికొందరు కేవలం ఆర్థిక పరమైనదని వివరించడం జరుగుతుంది. కాని సామస్త్య దృక్పథంలో దానిని పరిశీలిస్తే అది అసలు సిసలయిన మానవ సమస్య అని తెలుస్తుంది. భారతీయ సమాజంలో ఏ ఏ అంతస్తులు మానవ స్థాయికి ప్రతీకలుగా ఎంచబడుతున్నాయో, ఏ అంతస్తులు మానవస్వేచ్ఛకు దోహదకారిగా వుండగలుగుతున్న వారి అంతస్తులు అవకాశాలు సంప్రదాయకంగా దళితులకు నిరాకరించబడ్డాయి. వాటిలో ముఖ్యమైనవి సాంఘిక సమానత్వం, ఆర్థిక ప్రగతి. వ్యక్తి ఈ రెండు అంతస్తులలో అనుభవించే స్వేచ్ఛా పరిమాణాన్నిబట్టి అతని మానవత్వస్థాయి అంచనా వేయబడుతుంది. అనగా వ్యక్తికి ఇచ్చే విలువనుబట్టి అతని మానవ స్థాయిని నిర్ణయించవచ్చునన్నమాట. అసలు మానవత్వమంటే ఏమి? స్వేచ్ఛ, వివేచన, సమానత్వం, సౌభ్రాతృత్వం, న్యాయం, ప్రేమ మొదలయినవి మానవత్వానికి ప్రతీక. కాని భారతీయ సమాజంలోని విచిత్ర విషయమేమిటంటే ఒక వ్యక్తి ఈ గుణాలన్నింటిని అనగా ప్రేమ, న్యాయం, సమానత్వం, మంచితనం, మొదలగు వాటన్నింటిని కలిగియున్నా, సాంఘిక, ఆర్థిక అంతస్తులు లోపిస్తే ఆ వ్యక్తిని మనిషిగా చూడని ఆధ్యాత్మిక సమాజం. ఐతే, వ్యక్తికి పూర్తి మానవ స్వేచ్ఛ నిచ్చేది ఏది? సాంఘిక సమానత్వమా లేక ఆర్థిక ప్రగతియా? ఈనాడు దళిత ప్రజానీకాన్ని తీవ్రంగా ఆలోచింప జేస్తున్నదీ సమస్యే. కొందరు సాంఘిక సమానత్వాన్ని ముందు సాధిస్తే, తరువాత ఆర్థిక న్యాయం కొరకు పోరాడవచ్చునంటారు. మరికొందరు ఆర్థికసమానత్వం వస్తే సాంఘిక సమానత్వం దానంతటదే వస్తుందంటారు. సాంఘిక న్యాయంగాని, ఆర్థిక సమానత్వంగాని, వాటంతటవి మనదగ్గర వచ్చి పడవు. వాటినికోరే మనుషులు వాటికై ఎంతో పోరాడాలి. పోరాడాలంటే పోరాటంయొక్క అవసరత, స్వభావం, పోరాటానికయిన ఆలోచనావిధానము మొదలయిన వాటిని

తెలిసికొని యుండాలి. అనగా ఏ కారణాల వలన దళితులు అణచివేయబడ్డారో,ఏ భావాలవలన వీరు ఆ దోపిడీ శక్తులను ప్రతిఘటించలేకపోయారో ఆ భావాలనుండి విడుదల పొందాలి. దళితులను వారిని గురించి మానవ విహీనులుగా, బలహీనులుగా ఎంచుకొనేటట్లు చేసిన భావాలనుండి విముక్తి చెందాలి. అనగా దళితులలో భావ చైతన్యం జరగాలి. అప్పుడే ఒక శక్తిగా, రాజకీయ శక్తిగా విజృంభించగలుగుతారు.

ఈనాడు భారతదేశములోని దళితులలో మనం కళ్ళారా చూస్తూన్న మౌఢ్యం ఏదన్నా వున్నదంటే అది అపకుల స్పృహేనని చెప్పాలి. కులాల్ని నిరశించే దళితులు ఉపకులాలను పట్టుకొని వూగులాడుతున్నారంటే,బహుశ హేతువాదదృక్పధం అందరికంటే ముందు వీరికే అవసరమేమోననిపిస్తుంది. కులాతీత, కులరహిత వ్యవస్థనుకోరే దళితులే ఉపకుల స్పృహనుండి బయట బడలేకపోతే, కుల దురహంకారంలో మునిగి తేలే వారి ధోరణిని ఏమనాలి? కులపరంగా తరతరాలు అణగగొట్టబడిన ప్రజలు కులపరంగా కాకపోయినా, కనీసం ఆర్ధిక పరంగానయినా ఒక్క వేదిక మీదికి రాగలిగితే ఆర్ధిక పోరాట ప్రక్రియలో కుల స్పృహను పోగొట్టుకో గలిగిన అవకాశాలు మెండుగా వున్నట్లు చూడగలం. లౌకిక, మానవత, హేతువాద భావాన్ని పెంపొందించుకోవడ మొకతంతు; ఆ పునాదిపై, వ్యవస్థ మార్పు కొరకయినా పోరాటంలో నిమగ్నమవట మొక తంతు. ఈ రెండవ కార్యం జరగనిదే, భావ స్వేచ్ఛ లేక భావ చైతన్యం అసంపూర్ణం గానే వుండిపోవచ్చు. దళిత ప్రజలు కులాతీత, మతాతీత వర్గ పోరాటానికై ప్రేరణ కలిగించే సాధనాలలో హేతువాద దృక్పధం బలమైనది. ఈ దృక్పధం లేకుండా మనిషి మనిషి అవుతాడనేది కల్లమాట. ఏ మౌఢ్యాలు ఈ సమాజాన్ని నాశనంచేస్తున్నట్లుగా భావించబడుతున్నాయో ఆ కులం, మతం అనే వాటి ప్రవాహంలో దళితులు కొట్టుకొనిపోవడం విషాదకరం. ఈ మౌఢ్యాన్నుండి బయటపెట్ట గలిగేది ఒక్క హేతువాద దృక్పధమే. ☆

---

* నాకు దేవుడిపై నమ్మకములేదు. మత భావాన్ని చూస్తేనే నాకు షాక్ తగిలినట్టు ఉంటుంది. అసహ్యమేస్తుంది. తరచూ నేను మతాన్ని ఖండించుతూ వచ్చాను. దానిని సమూలంగా నాశనం చేయాలని నా కోరిక. మతమంటేనే గ్రుడ్డినమ్మకము, వెనుబాటుతనము, ఉన్మాదము, దోపిడీ, స్వార్థ పరిరక్షణ అని అర్థం.

—(నెహ్రూగారి స్వీయచరిత్రనుండి)

# మతము - శాస్త్రీయ దృక్పధము

—డా॥ హెచ్. నరసింహయ్య

200 కోట్ల సంవత్సరాలకు పూర్వం ఈ భూమిమీద అత్యంత స్వల్ప పరిమాణంతో జీవం ఆవిర్భవించబడింది. ఈ సుదీర్ఘ కాలంలో క్రమాను గతంగా జీవం అనేక మార్పులకు గురయింది. ఈ క్రమ పరిమాణంలో చతుష్పాదాల నుండి, నిరంతరం పనికి అంకితమయ్యే ముందరి రెండు కాళ్ళుకే మార్పు చెందడం సంభవించింది. ఈ మార్పు కొత్త అధ్యాయానికి నాంది పలికింది. ఈ పరిణామ క్రమంలోనే భాషకూడ అనేక మార్పులను సంతరించుకున్నది.

ప్రకృతి పనితీరు గురించి ఆదిమ మానవుడికి ఏమీ అర్ధంకానిస్థితిలో, చిత్ర విచిత్రమయిన ప్రకృతి అతన్ని తీవ్రంగా ప్రభావితం చేసింది. ఉరుములు, మెరుపులు, అతనిలో భయాన్ని, ఆశ్చర్యాన్ని కలిగించాయి. పట్టపగలే చీకటిని సృష్టించే సూర్యగ్రహణాలు, వండువెన్నెలలో మబ్బుల మాటలుగట్టే చంద్రగ్రహణాలు అతనికి అంతుపట్టని రహస్యాలుగా ఉండినాయి. ఇవన్నీ దైవికాలని నమ్మేవాడు. ఆదిమానవుడిలో చావు చెరిగిపోని ప్రభావాన్ని కలుగజేసింది. కాల గమనంలో ఆలోచన క్రమ క్రమంగా అభివృద్ధి కాజొచ్చింది. చుట్టుప్రక్కల జరుగుతున్న మార్పులను ఆసక్తిగా గమనించడం మొదలు పెట్టినాడు. సంభ్రమాశ్చర్యాలు అతన్ని ముంచెత్తాయి. ప్రతి ఒక మార్పు అతనిలో ఆలోచనలు రేకెత్తించాయి. ఇదే సైన్సుకు శాస్త్రీయ దృక్పధానికి ఆరంభం.

కొద్దిమందికి మాత్రమే సైన్సుకు సంబంధించిన అవగాహన ఉంది. ఉత్పత్తి వస్తువులతో సైన్సుకు అతి సులభంగా మిళితం చేయటమే కాకుండా, ఉత్పత్తి వస్తువులే సైన్సుగా భావిస్తున్నారు. మానవావసరమయిన వస్తు సముదాయాన్ని సైన్సు తయారుచేయుడం వాస్తవమైనప్పటికీ, వస్తు సముదాయాన్ని సైన్సుగా పరిగణించకూడదు. వస్తువులు వాటిమీద కొంత భావ గందరగోళం ఉన్నది. సైన్సును సాంకేతిక పరిజ్ఞానంతో ముడివేయడం సరయిందికాదు. దేవాలయం మతం కానట్లే విమానం సైన్సుకాదు. సైన్సుయొక్క శక్తిసామర్ధ్యాలు భౌతిక

గోచరాలు. అవి ఎంత లాభదాయకమయినా, సంభ్రమాశ్చర్యాలు గొలిపినా, లేక అవి ఎంత అందమయినవి అయినా అవన్నీ వివిధ తరగతులకు చెందినవే. భవనం వాస్తు శాస్త్రజ్ఞుడి నమూనాతో సమానం కాదు. వంటకం పద్ధతి తెలిపే కాగితం భోంచేయడంతో సమానంకాదు.

టి. వి. థామ్సన్ తన "సైన్సు పరిచయం" అన్న పుస్తకంలో ఇలా అంటున్నాడు. "అగోర విషయాల అనుభవాన్ని సైన్సు పరీక్షా పద్ధతిలో సాధ్యమయినంత ఖచ్చితంగానూ, సూక్ష్మంగానూ, పరిపూర్ణంగానూ వివరించగలగాలి." దృగ్గోచర విషయాల్ని శాస్త్రజ్ఞుడు పరిశీలిస్తాడు! నియమాల్ని గమనిస్తాడు. నిర్దిష్టమయిన అభిప్రాయానికొచ్చి ఫలితాన్ని రాబట్టుకుంటాడు. ఈ పద్ధతే సైన్సు సూత్రాల ఏర్పాటుకు దారి తీస్తుంది. ఈ రకంగా సైన్సు ఒక క్రమ విధానంతో వాస్తవానికి దగ్గరగా వస్తుంది. పరిక్షించినది తిరిగి పరీక్షించడం సైన్సులో అంతర్భాగం. సైన్సు విభాగంలో చేర్చుకునే ముందుగా ప్రతిదీ పరీక్షకు గురి కావలసిందే. ఏదీ సాక్ష్యాధారాలు లేకుండా అమోదింపబడదు. ప్రతిదీ ప్రశ్నించబడాలి, పరిశీలించబడాలి. అది ఎంతటి ప్రాచీనమయిన పుస్తకమయినా, సమాచారమయినా, చెప్పినవాడు ఎంతటి గొప్పవాడయినా సైన్సు పరీక్షించనిదే వాటి ప్రామాణికతను అంగీకరించదు. సైన్సు తనమీద నమ్మకం, సత్యంమీద గురుత్వంవల్ల మాత్రమే ప్రామాణికతను సంతరించు కుంది. శాస్త్రజ్ఞుడి ఇష్టా ఇష్టాలతో ప్రమేయం లేకుండా సైన్సు పూర్తిగా

---

(9వ పేజీ తరువాయి)

భావంలోకాని సంస్కృతిలోకాని భారతీయం కాకపోగా భారతీయ నగర సంస్కృతిని ధ్వంసంచేసిన ఆటవికుల ఆలోచనలే వేదాలని అర్థమవుతోంది. ఈ వేదాలు భారతదేశానికి తలమానికాలని, ఈ వేదాలలో సైన్సు వుందని, మన సంస్కృతి అంతా దాగి వుందని ఈనాటికి ప్రచారం చేస్తున్నవారు జాతీయవాద ముసుగులో అబద్ధాన్ని ప్రచారం చేస్తున్నారని ఈ పరిశీలన వలన తేలుతుంది. విజ్ఞులు, హేతువాదులు, భౌతికవాదులు వేదాల మూలాల్ని పరిశీలించి, అశాస్త్రీయ భావప్రచారాన్ని అడ్డుకోవలసిన అవసరం ఉంది. సాంస్కృతిక విప్లవాన్ని విజయవంతం చేయటానికి అడ్డు వస్తున్న ప్రప్రధానమైన అంశాలలో ఈ పునరుద్ధరణవాదంకూడా ఒకటి. దీన్ని పరిశీలనతో ప్రతి హేతువాది ఎదుర్కొంటాడని ఆశిస్తున్నాను. ★

వ్యక్తి యిష్టా యిష్టాలతో నిమిత్తం లేనిది. శాస్త్రజ్ఞుడికి ఏ రకమయిన ప్రలోభాలు ఉండరాదు. పరిశోధకుడికి మించిన స్వంత సంబంధాలని సైన్సు పరిశోధిస్తుంది.

శాస్త్రజ్ఞుడు పూర్తిగా వినమ్రతగా ఉంటాడు. అతను తన మనస్సు పట్ల నిజాయితీగా ఖచ్చితంగా ఉంటాడు. అతను పిరికివాడుకాదు. అతని మనస్సు తెరచుకున్న కవాటం లాంటిది. దీనర్థం అతని మెదడు శూన్యమయినదనో, ఖాళీదో అని కాదు. అతని మెదడు పారాచూట్ లాంటిది. తెరచుకున్నపుడే అది పని చేస్తుంది. సైన్సు ఫలితాలన్నీ ప్రకృతిలో పరిశీలించదగినవే. కొత్త అనుభావా లెక్కలలో ఇది మార్పుకు లోనవుతూ వుంటుంది. దీన్నే శాస్త్రీయ దృక్పథ అని గానీ, సత్యాన్ని తెలుసుకోడానికి శాస్త్రీయ పద్ధతనిగానీ అంటారు. సైన్సుయొక్క నిజ మయిన ప్రాముఖ్యత అది సాధించిన ఫలితాలలోకన్నా విధానంలోనే వుంది. ఈ శాస్త్రీయ పద్ధతి సార్వ జనీనమయినది. సమస్యను అవగాహన చేసుకోడానికి సైన్సు ఒక శక్తివంతమయిన సాధనమేకాదు. దారి, పరిష్కారాన్ని కనుక్కోవడానికి కృషిచేస్తుందికూడా.

దీర్ఘ కాలం మత మౌఢ్యంతోనూ, పిడివాదంతోనూ, తీవ్రమయిన పోరాటం చేయడంద్వారా సైన్సు ఈ శక్తిని ప్రతిష్ఠను పొందగలిగింది. ఈ అంధకారానికి వ్యతిరేకంగా ఇంకా పోరాటం కొనసాగుతూనే వుంది. సైన్సు సాంకేతిక రంగాలలో గణనీయమయిన అభివృద్ధిని సాధిస్తున్నా, శాస్త్రీయ దృక్పథంలో అదే కృషి జరగకపోవడం విచారించదగ్గ విషయం. ఈ కాలపు గొప్ప రసాయనిక శాస్త్రజ్ఞుడు, బ్రిటీష్ ప్రభుత్వ ప్రధాన సైన్సు సలహాదారుడు అయిన "లార్డ్ టాడ్" ఈ విధంగా అంటాడు. "గత కాలపు మొత్తం మానవ చరిత్రలో జరిగినదానికన్నా, గడచిన వంద యేళ్ళలో నాగరికతా, భౌతిక వికాసాల్లో అనేక గొప్ప మార్పులు సంభవించాయి.... ఈ మార్పులన్నీ సైన్సు, సాంకేతిక పరిజ్ఞానంవల్లె సాధ్యమయినాయి. పరిశ్రమలు, వ్యవసాయం, వైద్యం, రక్షణ, ప్రభుత్వ పాలనా రంగాల్లో శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానం వర్తింపజేయడం వలనే ఇది సాధ్యమైంది. దాని మూలంగా ఇవ్వాళ శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానం వ్యక్తుల అంత రంగిక, బాహ్య జీవితాలలో బలమయిన ముద్ర వేసింది. వాటివల్ల మన సాంఘిక వ్యవస్థలో బలమయిన ప్రభావం శతాబ్దాలుగా మౌనంగా కొనసాగుతున్నది. శాస్త్రీయ సాంకేతిక రంగాలు వేగంగా పురోగమిస్తున్న

ప్పటికి నేటి ప్రపంచంలో బరువు బాధ్యతల మూలంలో సైన్సు మార్పులకి సామాజిక ప్రవర్తనకు మధ్య తీవ్రమయిన అంతరం ఉండటమే సమస్యగా వుంది.

మానవుడు చంద్రగ్రహంలోకి వెళ్ళి విజయవంతంగా తిరిగి వచ్చినాడు. అయినా గ్రహణాలకు రెండు సిద్ధాంతాలు వుండనే ఉన్నాయి. ఒకటి తరగతిలో బోధించడానికి, మరొకటి గృహంలో ఆచరించడానికి. రాహు కేతువుల విష కౌగిలినుండి చంద్రుడు, సూర్యుడు తప్పించుకోలేరు. డార్విన్ మానవ పరిణామ సిద్ధాంతాన్ని తరగతిలో శాస్త్రీయంగా బోధిస్తున్న ఆచార్యుడే పూర్తిగా ఇలాంటి అశాస్త్రీయ సిద్ధాంతాన్ని నమ్ముతున్నాడు. పదార్థం సృష్టింపబడదు, నాశనం చేయబడదు అని విద్యార్థులకు శాస్త్రీయంగా బోధిస్తున్న భౌతిక శాస్త్రాధ్యాపకుడు బయటి ప్రపంచంలో ఒక గడియారం శూన్యంనుండి సృష్టింపబడుతున్నదని నమ్ముతున్నాడు. ఖగోళ శాస్త్రజ్ఞుడు పూర్తిగా అశాస్త్రీయమయిన జ్యోతిష్యాన్ని నమ్మడంలో అసాధారణమేమీ కాదు. వారు తమ శాస్త్రీయ పరిశోధనలో ఎంత హేతుబద్ధులుగా ఉన్నప్పటికీ, నిజ జీవితంలో పూర్తిగా అశాస్త్రీయమయిన భావాలు కలిగి ఉంటున్నారు. వారికి సంబంధించిన శాస్త్ర పరిజ్ఞానం వారి హృదయాలలోంచి సెలవు పుచ్చుకొన్నట్లుగా కనిపిస్తున్నది. మత మౌఢ్యం పుట్టగొడుగుల్లా వ్యాపిస్తున్నది. సమాజం మత మౌఢ్యాల ఉపరితలంపై నిర్మితమై ఉన్నది.

వర్తమానంలో సైన్సు విశ్వవ్యాప్తంగా ఎదురించబడినా, సైన్సుయొక్క సత్ఫలితాలు అన్నిచోట్ల కన్పిస్తున్నాయి. కానీ సైన్సుయొక్క జీవసారం ఇంకా సాధారణీకరింపబడలేదు. సైన్సు సాంకేతిక పరిజ్ఞానం లేనిదే జీవించటం దాదాపు అసాధ్యం. వ్యక్తి సమగ్రాభివృద్ధి, సామాజిక శ్రేయస్సు. ★

---

## అభివృద్ధి నిరోధకులు

గడియారం వెనుకకు త్రి
ప్పెడి వారే నేడు మనకు పెత్తనదారుల్
నడి కడలిని పడవను ముం
చెడి నావికు లిట్టివారె సిరిసిరిమువ్వా—

సేకరణ : యస్.పి. గమనం — (శ్రీశ్రీగారి "సిరిసిరిమువ్వలు" నుండి.)

# లౌకిక శక్తులు ఏకం కావాలి - మత రాజకీయ కుట్రలను ఎదిరించాలి!

ఒక ప్రక్క మత సంఘర్షణల మారణహోమం జరుగుతూనే వుంది. మత పునాదులమీద భారతక్షోణిని ప్రయ్యలుచేసి స్వతంత్ర భారతంగా మూడు రంగుల జెండా ఆనాడు ఎగుర వేశాం. అంతకుముందునుండే భారతదేశ చరిత్రను హిందూ యుగంగా, ముస్లిం యుగంగా, బ్రిటిష్ యుగంగా చీల్చి బోధించిన వలస వాదుల చరిత్రనే నేటికి బోధించుకొం టున్న భారత ప్రభుత్వం, కేవలం రాజకీయ అధికారాన్ని బ్రిటిష్‌వాళ్ళ నుండి వీరి చేతులలోకి తీసుకోవడం మాత్రమే జరిగింది. పరిపాలనా స్వభావంలో మౌలికమయిన మార్పు రాకపోగా ఆనాటినుండి ఈనాటివరకు నడచిన 37సంవత్సరాలలో జాతి, మత, కుల, ప్రాంతీయతత్వాలు మూడు పువ్వులు, ఆరు కాయలుగా దినదిన ప్రవర్ధమానం అవుతూ వస్తున్నాయి. అనేక సవరణలు తరువాత "సామ్యవాద లౌకిక ప్రజాస్వామ్య గణ తంత్ర రాజ్యంగా" మన రాజ్యాంగం మన దేశ స్వభావాన్ని నేడు పేర్కొంటుంది.

మన సామ్యవాద దేశం ముప్పయివేల కోట్లకు పైగా ఇతర దేశాలకు తాకట్టులో వుంది. దేశం నడిబొడ్డుగుండా డెబ్బయివేల కోట్లకు పైగా నల్ల ధనం ప్రవహిస్తూ వుంది. టాటాలు, బిర్లాలు వంటి పెట్టుబడిదారుల దినదినాభివృద్ధి చెందుతున్న ఆర్థిక బలంతో బలిమైన ఆధిపత్యాన్ని నెరుపుతూ ఉన్నారు. కోట్లాదిమంది విద్యావంతులు నిరుద్యోగ వూబిలో దిగబడి ఉన్నారు. దేశంలో సగభాగానికి పైగా ప్రజలు నిరక్షరకుక్షులుగా జీవిస్తున్నారు. మూడు లక్షల ఇరవై వేల కోట్ల పెట్టుబడితో వస్తున్న ఏడవ ప్రణాళిక వరకు వచ్చిన ప్రణాళికలు కొన్ని వేల గ్రామాలకు దోసెడు మంచినీళ్ళు అందించలేకపోయాయి. రైతు దళారీల కబంధ హస్తాలలో చిక్కుకొని గిట్టుబాటుధర లేక నానాటికి కృశిస్తూ వున్నాడు. వ్యవసాయ కూలీలకు సంవత్సరమునకు నాలుగు నెలల పని, ఆ పనిలో అతడికి లభిం చేది తిండికి, బట్టకూ చాలదు కదా! గంజికి, గోసెకుకూడా చాలని దుస్థితి వెంటాడుతూనే వుంది. తరతరాలుగా అణగ ద్రొక్కబడిన జాతులపై తీవ్ర మయిన హత్యలు, దాడులు నిత్యకృత్యంగా జరుగుతూ ఉన్నాయి. రాజకీయ అధికారం ధనవంతులు, గూండాల చేతులలోకి పోయింది.

నెహ్రూ తరువాత ఇందిరాగాంధి తమ వంశ పరిపాలనా క్రమాన్ని కాపాడు కోవడం కోసం సోషలిజమనే అందమైన మాటలను పదేపదే వల్లిస్తూ ప్రజలను తీవ్ర ఆర్థిక సంక్షోభంలోకి నెట్టి తన సింహాసనాన్ని కాపాడుకోవడానికి తన ఉగ్ర శక్తి రూపాన్ని బహుముఖంగా ప్రదర్శించడానికి అనేక ప్రయత్నాలు చేస్తూనే ఉంది.

దేశం ఈ విధంగా ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడుతుంటే దేశంలో మతాగ్ని గుండాలు నలుమూలలా రగులుతూ వున్నాయి. పంజాబ్ ఒక అగ్ని పర్వతమై కూర్చుంది. భివాండి, మహారాష్ట్రలో జరిగిన మత మారణాలలో నెత్తురుటేరులు ప్రవహించాయి. ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన బోనాలపండుగ సంక్షోభంలో తెలుగుగుండెలు ప్రయ్యలయ్యాయి. ఏమిటి దీనంతటికి కారణం అనేది ఈనాటి ప్రతి లౌకికవాది ఆలోచించాల్సిన అవసరం మన ముందుకు వచ్చింది. మనది సెక్యులర్ రాజ్యం. అంటే మతానికి, రాజ్యానికి ఎట్టి ప్రత్యక్ష సంబంధము వుండడానికి వీలులేదు. రాజ్యం మతాతీతంగా వ్యవహరించాలి. మన దేశంలో హిందూ, ముస్లిం, క్రైస్తవ, సిక్కు, బౌద్ధ, జొరాష్ట్రియన్‌వంటి అనేక మతాలు వున్నాయి. ఈ మతాలవారు వ్యక్తిగతంగా తమ తమ మతాలను అనుసరించవచ్చు. ప్రశాంతంగా ప్రచారం చేసుకోనూ వచ్చు. దానివల్ల పెద్ద ప్రమాదం రాదు. ఈ మతాలను అడ్డుపెట్టుకొని మత విద్వేషాన్ని రెచ్చగొట్టి రాజకీయాలకు ఉపయోగించుకోవడం అనే దానితోనే ఈ మత సంఘర్షణలు ముడిపడి వున్నాయి. అసలు దేశ స్వాతంత్ర్యోద్యమానికి పోరాడే కాలంలోనే తిలక్‌వంటి మత ఛాందసోగ్రవాదులు హిందూమత హింసావాదాన్ని, భగవద్గీత యుద్ధప్రక్రియను, కాళీమాత, శివుడువంటి వారి ఉగ్ర స్వరూప స్వభావాలను ఆదర్శంగా తీసుకొని హిందూ రాజ్యాన్ని ఆవిర్భవింపజేయాలనే దౌర్జన్యతత్వాన్ని ప్రజలపై రుద్ది గణేశ తిరునాళ్ళతో మత ఉద్వేగాన్ని ప్రజలలో రేపడానికి ప్రయత్నించడం, ఆ ఉన్మాదాన్ని రాజకీయ ప్రయోజనాలకు ఉపయుక్తం చేయడం అనాడే ప్రారంభమయింది. మహాత్మాగాంధీకూడ రామనామ జపం, భగవద్గీత బోధనలు ఆనాడే అటవాటు చేశాడు. తరువాత మత విద్వేషాగ్ని ఆయన్నుకూడా దహించింది. ఈ విధంగానే పంజాబులో మతానికి రాజకీయాన్ని జోడించి అకాలీల తమ హక్కులకోసం పోరాతూ వున్నారు. నెహ్రూ దగ్గరనుండి కోరికల విషయంలో జాప్యం చేస్తూ పంజాబులోవున్న హిందూ శిక్కు విభేదాలను

పాలక వర్గాలు తమ రాజకీయ ప్రయోజనాలకోసం వినియోగించుకొంటూనే వున్నారు. ఇందిరాగాంధి జాతి, మత, కుల, ప్రాంతీయ తత్వాలను తన ప్రయోజనాలకోసం వినియోగించుకోవడంలో సిద్ధహస్తురాలు. ఇంకొక ప్రధానమయిన అంశం, హిందూ రాజ్యాన్ని స్థాపించడానికి ఏర్పడిన రాష్ట్రీయ స్వయం సేవక సంఘం, దాని రాజకీయ వేదిక, భారతీయ జనతాపార్టీ, దాని సాంస్కృతిక వేదిక, విశ్వ హిందూ పరిషత్, దాని విద్యార్థి వేదిక, అఖిల భారత విద్యార్థి పరిషత్. ఇది భారతదేశంలో మత సంక్షోభం రావడానికి ప్రధాన పాత్రను వహిస్తున్నాయి. భారతదేశంలో ఎక్కడ ఏ మత సంఘర్షణ జరిగినా దాని వెనుక ఈ సంస్థల హస్తం ప్రధానంగా వుంటుంది. వీరి ఎత్తుగడలు, వ్యూహాలు చాలా విచిత్రంగా ఉంటాయి. ఇందిరాగాంధీ పరోక్షంగా వీరితో చేతులు కలుపుతూ వుందనేది నగ్నసత్యం. అయితే బి.జె.పి. ప్రతిపక్షాలలో సెక్యులర్ పునాదులమీద నిర్మింపబడిన వామపక్ష పార్టీలతో కూడా ఇందిరాగాంధీని రాజకీయంగా వ్యతిరేకించడం పేరుమీద సఖ్యతను పెనవేసుకోవడం – అటు పాలక వర్గాన్ని ఇటు ప్రతిపక్ష వర్గాన్ని తమ మత రాజ్య స్థాపనా కార్యక్రమంలో పావులుగా వాడుకునే ప్రయత్నంలో వారు కృతకృత్యులుకావడం చూస్తూనే వున్నారు.

పంజాబులో శిక్కుల మత ఛాందసానికి దీటుగా వీరు తమ బలాన్ని అంతరంగికంగా పెంచుకున్నారు. ఇందిరాగాంధి అండ వారికి పరోక్షంగా వుండనే వుంది. భారతదేశానికి వెలుపల ఉన్న శక్తులు బింద్రన్‌వాలె విచ్ఛిన్నకర మత రాజకీయ తత్వాన్ని వాడుకోవడానికి ప్రయత్నించక ముందే ఇందిరాగాంధీ, బింద్రన్‌వాలేను దువ్విన విషయంకూడా పెక్కురకు తెలిసిందే. సెక్యులర్ రాజ్యంలో ఒక మత రాజకీయ దండు నాయకుడు తన బలాన్ని స్వర్ణ దేవాలయం కేంద్రంగా చేసుకొని సైనిక శిక్షణా శిబిరాన్ని నిర్వహిస్తూ భారతదేశానికి వెలుపలనుండి ఆయుధ సామగ్రిని యధేచ్ఛగా తెస్తున్న రోజున పాలకవర్గము, గూఢాచారి వర్గము, తమ వేయి కళ్ళను మూసుకొని కూర్చోవడానికి కారణం ఏమిటి? అంతేకాదు, ఎందరో అమాయకులను, పత్రికా విలేఖరులను దారుణంగా హతమార్చినపుడు ఈమె పరిపాలనా దక్షత ఏమి చేసింది? సి.ఐ.ఎ. తన దారుణ వ్యూహాన్ని స్వర్ణ దేవాలయం మార్గంగా నెరవేర్చుకోవడానికి ప్రయత్నిస్తున్నపుడు టోపులేని జీపులో భారత పాలకవర్గం తిరిగితే సరిపోతుందా? పది

వేల కోట్లకు పైగా భారతదేశాన్ని, ఇతర దేశాలనుండి రక్షించుకోవడానికి ప్రజా ధనాన్ని మన బడ్జెట్‌లో సైన్యంకోసం ప్రభుత్వం ఖర్చుపెడుతుంది. ఆ సైన్యాన్ని ఇందిరాగాంధి తన ఉగ్ర స్వరూపాన్ని ప్రపంచానికి నెత్తుటి చారలతో లిఖించి చూపడానికి ఉపయోగించుకుంది. అంత దూరం తెచ్చి నందుకు పాలక వర్గానికి వేయ వలసిన శిక్ష ఏమిటి? బింద్రన్‌వాలె వర్గాన్ని తునుమాడిన ఇందిరాగాంధి, లక్షలకు పైగా సైన్యాన్ని పేర్చుకొని అంత కంటే మారణాయుధాలతో సమయం కోసం వేచి చూస్తున్న ఆర్.ఎస్.ఎస్. మీద దాడి చెయ్యదు ఎందుకని? ఆర్. ఎస్. ఎస్.కి మాత్రం ఇతర దేశాలనుండి మారణాయుధాలు రావటంలేదా? ఇస్లాంకు ఇరాన్, ఇరాక్‌ల నుండి ఆయుధాలు రావడంలేదా? క్రైస్తవ మతంవారికి ఆయుధాలు లేవా? భారతదేశంలోవున్న దేవాలయాలన్ని ఈనాడు ఎందుకు తనిఖీ చేయడంలేదు.

ఇవన్నీ ఈనాడు తీవ్రంగా ఆలోచించవలసిన అవసరం వచ్చింది. ఆర్.ఎస్.ఎస్. వాళ్ళు బహిరంగంగా కర్రలతో, కత్తులతో ఊరేగింపులు జరుపుతూ వున్నారు. వీరి సైన్యం ఈ విధంగా పెరుగుతూపోతే భారత సైన్యంకూడా ఎదిరించలేని పరిస్థితి రావచ్చు. లేదా హిందూ సైనికు లందరూ వీరితో చేతులు కలుపవచ్చు. అప్పుడు దేశం పరిస్థితి ఏమిటి? ఇందిరాగాంధి తన స్వార్థప్రయోజనాలకోసం వ్యవహరిస్తున్న తీరు దేశాన్ని తీవ్ర సంక్షోభానికి గురి చేస్తూ వుంది. ఈనాడు హైదరాబాదులో బోనాల [illegible] ఊరేగింపుసందర్భంగా చెలరేగిన సంఘర్షణ వెనుక ఆర్.ఎస్.ఎస్. జమాయితే. ఇస్లాం హస్తాలు బలంగా యున్నాయి. దీనికి తోడు ఆంధ్ర రాజకీయాలలో నాయకులకు మతాన్ని, కులాన్ని, ప్రాంతాన్ని ఉపయోగించుకోవాలనే దుష్ట వ్యూహం మరీ మరీ ఈ సంఘర్షణకు మూల మవుతున్నది. ఈ సంఘర్షణలలో ప్రధానంగా గూండాలు పాల్గొంటు న్నారు. ఈ పరిస్థితులను ప్రతిపక్షాలు నిజాయితీగా పరిష్కరించే మార్గా లను అన్వేషించలేకపోవడానికి కారణం ఎన్నికల వ్యూహం. ఎన్నికలతో సంబంధమున్న ఏ పార్టీ అయినా మతవాద సంస్థలను, ఆ సంస్థల పునా దుల మీద నిర్మింపబడినపార్టీలను నిర్ద్వంద్వంగా ఖండించలేకపోతున్నాయి. ఇప్పుడు నిజాయితీతో ఈ సమస్యలకు పరిష్కార మార్గాన్ని అన్వేషించాలి. ముఖ్యంగా ఇందిరాగాంధీ కుహనా రాజకీయ తంత్ర గుట్టును ప్రజలకు తెలియజేయాలి. మన దేశములో ప్రజాస్వామ్యం అనేది ఒక నీతి

ముసుగుగా తయారయ్యింది. ఇందిరాగాంధీ తన నియంతృత్వ ధోరణులను బహుముఖంగా చెలామణి చేసుకొంటూ ఉంది. ఆమె అధికారాన్ని నిలబెట్టుకోవడం కోసం కాంగ్రెసేతర రాష్ట్రాలలో రాజకీయ కల్లోలాలను లేపి ముఠా రాజకీయ వ్యూహాలతో ప్రభుత్వాలను కూల్చుతూ ఉంది. ప్రతిపక్షాలు ఆమెను ఎదిరించడానికి ఆ కుహనా రాజకీయాల దారులలోనే నడుస్తున్నాయి. ఇవి ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సంతరించుకోలేకపోతున్నాయి. సెక్యులర్ సోషలిస్టు భావాలను ప్రజలలో వ్యాపింపజేయాలంటే ఆర్.ఎస్.ఎస్., జమాయితే ఇస్లాంవంటి సంస్థలను పూర్తిగా నిషేధించాలి. మత సంబంధమయిన ఉరుసులు, ఉత్సవాలు, ఊరేగింపులు పూర్తిగా నిషేధించాలి. కార్యాలయాలలో, బస్టాండులలో, రైల్వే స్టేషనులలో దేవుడి గుళ్ళు, ఫోటోలు, ప్రచారపు మైకులకు స్థలాలు కేటాయించడం నిషేధించాలి. మతం పునాదులమీద ఉన్న రాజకీయ పార్టీకి గుర్తింపు యివ్వకూడదు. ఇతర దేశాలనుండి మత సంస్థలు స్వేచ్ఛగా విహరించడానికి వీలులేదు. కృష్ణ చైతన్య సంఘంవంటి (సి.ఐ.ఎ.) గూఢాచారులకు నెలవయిన సంఘాలను రద్దు చేయాలి. క్రైస్తవ మతం పేరుతో ఇతర దేశాల గూఢాచారులుగా వ్యవహరిస్తున్న వారిని నిర్బంధించాలి. రాజకీయ ఉపన్యాసాలలో మత, కుల, ప్రాంతీయ తత్వాన్ని రెచ్చగొట్టే విధానాన్ని పూర్తిగా నిషేధించాలి. రాజకీయ నాయకులు స్వాములవార్ల పాదాలకు మోకరిల్లుతూ వారి చెప్పు చేతులలో మెదలడం దేశానికి అవమానంగా భావించాలి. ఉదాహరణకు మన రాష్ట్రపతి జైల్‌సింగ్ రాజమండ్రీ రావులింగ సిద్ధాంతి కాళ్ళు పట్టుకోవడం దేశానికి అవమానం కాదా? స[illegible]బాబా, జిల్లెళ్ళమూడి అమ్మ, జంద్లమ్మవారి దగ్గర జేరిన ఇతర దేశాల గూఢచారులను గుర్తించాలి. మానవత్వాన్ని, మానవతత్వాన్ని అవమానించే అవమానకరమయిన వారి చర్యలను నిషేధించాలి. నంబూరి కాశీబాబ వంటి వారి శృంగార క్రీడలను బయటపెట్టి ఖూనీకోరులకు ఆశ్రయమిచ్చే సంస్థలను మూసివేయాలి. కర్నాటక రాష్ట్రంలో నిశివమొగ్గ జిల్లా, చంద్రగుత్తి గ్రామాల వంటి వాటిల్లో "ఎల్లమ్మ" జాతర పేరుతో జరిగే "నగ్న భక్తః" ఊరేగింపులు నిషేధించాలి. ఇప్పటికీ పోలేరమ్మ సిళ్ళలో జరిగే మతోన్మాద తిరునాళ్ళ బలులు, రక్తప్రోక్షణాలను పూర్తిగా రద్దుచేయాలి. కలకత్తా కాళికాదేవికి ఇప్పటికీ నరబలి ఇస్తున్న వారికి ఉరిశిక్ష వేయాలి. తామే దైవ స్వరూపముగా భావించుకొని

కొబ్బరి నీళ్ళతోను, మంచి తీర్థంతోను కాళ్ళు కడిగించుకొంటున్న త్రిపాఠి వంటి నాయకులను శిక్షించాలి. ప్రజల అజ్ఞానాన్ని ఆసరాగా తీసుకొని బాణామతి, చిల్లంగివంటి నమ్మకాలను ప్రచారం చేస్తున్న పెద్ద మనుషులకు సంకెళ్లు వేయాలి. ధీరేంద్ర బ్రహ్మచారివంటి వారి దేశ విద్రోహ చర్యలను పూర్తిగా నిషేధించి వారి ఆస్తులను, ఆయుధ ఫ్యాక్టరీని ప్రభుత్వ పరం చేయాలి. ఇట్లాంటి దుష్ట శక్తులను పోషిస్తున్న ప్రభుత్వ విధానాలను అభ్యుదయ, లౌకిక, విప్లవ, హేతువాద శక్తులన్నీ ఏకమై సంఘటిత శక్తితో ఎదిరించాలి. ప్రజలకు సత్యాన్ని, విజ్ఞానాన్ని అందించాలి. మత విద్వేషాన్ని రగిలించే "జాగృతి" వంటి హిందూమత పత్రికలను, ఇస్లాం, క్రైస్తవమతాల పత్రికలను నిషేధించాలి. రేడియో, టి.వి.లలో మత సంబంధమైన ఉపన్యాసాలు, బోధనలు, గీతాలు, నాటికలు ప్రచు రించడాన్ని పూర్తిగా నిషేధించాలి. ప్రజల ప్రశాంతతకు భంగం కలిగించే విధంగా మైకులను స్వేచ్ఛగా వినియోగించడాన్ని నిషేధించాలి. విద్యా ర్థుల మనస్సులను కలుషితంచేసే విధంగా రూపొందించబడిన విద్యా విధా నాన్ని పూర్తిగా మార్చివేయాలి, మతాన్ని కులాన్ని రెచ్చగొట్టే పాఠ్యాం శాలను తొలగించాలి. సెక్యులర్ భావోద్దీప్తంగా పాఠ్యాంశాలు వుండాలి. మాయావాదాన్ని మంత్ర తంత్ర మార్మిక వాదాలను సైన్సుకు జోడించి యువకులను భయభ్రాంతులకు గురిచేసే సాహిత్యాన్ని నిషేధించాలి. సమ్మక్క జాతరలకు, కోటప్ప తిరునాళ్ళకు ప్రత్యేకంగా ప్రభుత్వం బస్సులు ఏర్పాటుచేసే పద్ధతిని నిషేధించాలి. ముమ్మడివరం బాలయోగివంటి వారి ఆశ్రమాల శివరాత్రి ఉత్సవాలను ప్రభుత్వ సిబ్బంది స్వయంగా నిర్వహిం చడం వంటివి పూర్తిగా మానివేయాలి. ప్రభుత్వ గూఢచారి విభాగం మత సంఘర్షణలకు కారకులయిన వారిని నిజాయితీతో గుర్తించి శిక్షించాలి.

పాలకవర్గం తమ ప్రయోజనాలకోసం నిరంతర మత మారణ హోమా లను రగిలిస్తున్న క్రమంలో పై నిబంధనలను నిషేధాలను ఆచరించదనేది మనకు ఆచరణలో రుజువు అవుతునే వుంది.

అందుకే ప్రజలకు ఆర్థిక, సాంఘిక సాంస్కృతిక చైతన్యాన్ని కలి గించే క్రమంలోనే సెక్యులర్ భావంయొక్క ఆవశ్యకతను ప్రజా ఉద్య మాలు తెలియజెప్పాలి. అభ్యుదయ విప్లవ లౌకిక శక్తులన్నీ ఏకమై ప్రభుత్వం సెక్యులర్ విధానాలలో నడవడానికై బలమయిన పోరాటాన్ని

[మిగతా 23వ పేజీలో]

# విజ్ఞానము  —యం. జి. ఇక్బాల్

I 1) మన భూమికి దగ్గరలోని నక్షత్రమేది? అంటే కొంచెం తెలివిగా "సూర్యుడే" అన్నాడట ఓ స్టూడెంటు. నిజమే కాని, మనకు రాత్రిపూట కనిపించే నక్షత్రాలలో మన భూమికి దగ్గరగా ఉన్న దేదో చెప్పి, ఎంత దూరంలో ఉందోకూడా చెప్పండి?

2) నవగ్రహాలకు కేంద్రమయిన "సూర్యుని" నుండి అనంతకోటి సూర్యుల కూటమి గెలాక్సీ కేంద్రానికి మధ్య దూరమెంతో మీకు తెలుసా?

3) గెలాక్సీ అంటే గుర్తొచ్చింది. మన గెలాక్సీలో ఇప్పటివరకు ఎన్ని నక్షత్రాలవరకు గుర్తించటం జరిగింది?

4) నవగ్రహాలు సూర్యుని చుట్టూ తిరుగుతున్నట్లు సూర్యుడుకూడా మన "గెలాక్సీ" చుట్టు తిరుగుతున్నాడు. అయితే ఎంత కాలం పడుతుందో చెప్పుకోండి? అలాగే గెలాక్సీ తన చుట్టూ తాను ఒక చుట్టు తిరగటానికి ఎంత కాలం పడుతుందో తెలుసా?

5) మన పూర్వులు చంద్రునిలోని మచ్చలను చూసి కుందేలుగాను చెట్టుక్రింద ముసిల్దిగాను ఊహించారు. అయితే వారి ఊహలు సరియైనవి కావని అవి పెద్దపెద్ద లోయలు, కొండలని రుజువు చేశారు శాస్త్రజ్ఞులు. అయితే లోయలకున్న శాస్త్రీయ నామమేమిటి?

## విజ్ఞానం సమాధానాలు :

1) ప్రాక్సిమా సెంటారై – 25 లక్షల కోట్ల మైళ్ళు – 40 ల.కో. కి.మీ.
2) 30 వేల కాంతి సంవత్సరాలు.
3) దాదాపు 10,000 కోట్ల నక్షత్రాలు.
4) 25 కోట్ల సం. 50 కోట్ల సం.
5) క్రేటర్స్ అంటారు.

---

* లోయలు=కొండల మధ్య అతి విశాలమైన ప్రదేశము.

## 11 కొన మెరుపు........

తెలుసుకుందాం........

| రేడియో టెలిస్కోపు ఎత్తు (అడుగులలో) | నిర్మిత ప్రదేశము | దేశము |
|---|---|---|
| 1) 250" అ॥ | మాంచెస్టర్ యూనివర్సిటీ బోడ్రెల్ బాంక్ రీసెర్చ్ సెంటర్ | Ingland (ఇంగ్లాండ్) |
| 2) 140" అ॥ / 300" అ॥ | గ్రీన్ బాంక్ | అమెరికా |
| 3) 210" అ॥ | | ఆస్ట్రేలియా |
| 4) 1000 | | పోర్టికో |

కుళ్ళు కోర్కెలకోసం గుళ్ళు కొట్టించ్చొనే వెధవాయి

కనిపించని మాధవుణ్ణి
కాన్కలతో కొలుస్తారు
కనిపించే మానవుణ్ణి
కాలరాయ దలుస్తాడు

ఈ పదవులు ఈ బ్రతుకులు
శాశ్వతమని భ్రమించినా
ఎరుపెక్కిన తూర్పు దిక్కు
అపరాధుల క్షమించునా!

సేకరణ : యస్.పి. గమనం —(శ్రీశ్రీగారి "ప్రాస క్రీడలు"నుండి)

(11వ పేజీ తరువాయి)

నడపాలి! ప్రజల్ని మేలుకొలిపి మత సంఘర్షణలు వెనుక వున్న ఈ రాజకీయ వ్యూహాన్ని ఎరుకపరచాలి. సామాజిక విప్లవాన్ని విజయవంతం చేసే క్రమంలో లౌకిక శక్తులన్ని ఏకమై పోరాడిననాడే ఇది సాధనమవుతుంది. అందుకే మత మారణ హోమాన్నుండి దేశాన్ని రక్షించడానికి సాంస్కృతిక పోరాటానికై లౌకిక అభ్యుదయ విప్లవ శక్తుల నన్నింటిని కలసి రమ్మని హేతువాదసంఘం విన్నవిస్తుంది. ★

—శక్తి పద్మారావు

# స్త్రీలను ప్రక్కదారి పట్టిస్తున్న సాహిత్య ధోరణులు

డా॥ కాత్యాయనీ విద్మహే
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్.

( గత సంచిక తరువాయి )

ఈనాడు సాహిత్యంలో స్త్రీ పాత్ర చిత్రణ విషయంలో పురుషుణ్ని ప్రేమించటం, వాటి సాఫల్య వైఫల్యాలకు సంబంధించిన అసంబద్ధ అసహజ ప్రవర్తనలు, అర్ధంలేని త్యాగాలూ ప్రాధాన్యం వహించటం గమనించవచ్చు. స్త్రీకి వివాహమొక్కటే జీవిత పరమార్ధమన్న సాంప్రదాయిక భావానికి కొనసాగింపుగా ఈనాడు నవలలన్నీ స్త్రీ పెళ్ళి చేసుకొని ఒక యింటి యిల్లాలు కావటంతో ముగుస్తున్నాయి. ఇవన్నీ అంతిమంగా స్త్రీలు తాము పాలు పంచుకోవలసిన సామాజిక కార్య కలాపాల గురించి ఆలోచించనీయకుండా సమాజంలో తాము కోల్పోయిన తమ సగం స్థానాన్ని తిరిగి సంపాదించుకోవటానికి ప్రయత్నం చేయనీయకుండా చేస్తున్నాయి.

శివరాజు సుబ్బలక్ష్మి వ్రాసిన "అదృష్టరేఖ" అనే నవల వుంది. ఆ నవల కథా కాలం రెండో ప్రపంచ యుద్ధ కాలం. అందులో నాయిక వరలక్ష్మి బెనారస్ యూనివర్సిటీనుండి యఫ్. ఎ. పరీక్ష పాసవుతుంది. పెద్దలు ఆ అమ్మాయికి పెళ్ళి చేస్తారు. పెళ్ళిలోనే భర్తకు వేరే స్త్రీలతో సంబంధముందని తెలుస్తుంది వరలక్ష్మికి. అతను వేరే స్త్రీతో వుంటున్నాడని తెలిసికూడా, ఆ అమ్మాయికి తాను రావటం యిష్టం వుంటుందో వుండదోనని అనుమానిస్తూకూడా. అతని దగ్గరకు కాపరానికి వెళ్ళాలనుకుంటుందామె. అతను సుఖ రోగాల పాలయి ఇల్లు చేరాడని తెలిసినప్పుడు వెంటనే అత్తవారింటికి వెళ్ళి అతనికి సేవలు చేసి బ్రతికించుకొంటుంది. అతనికి సేవలు చేయటం కోసం తనను ప్రాణంగా ప్రేమించిన తండ్రి సంవత్సరీకాలకుకూడా పోవటం మానేస్తుందామె. ఇదంతా ఆమె ఆత్మ సంస్కార ఫలితంగా జరిగిందన్న ధ్వని వుంటుంది నవల అంతటా పరచుకొని. వరలక్ష్మి ఈ ఆత్మ సంస్కారాన్ని పొందటానికి ఆమె భాగవతం చదవటం, రుక్మిణితో తాదాత్మ్యాన్ని భజించి ఆమె కృష్ణుణ్ని

ఆరాధించినట్లు తాను తన భర్తను ఆరాధించటం, స్వామీజీ చేసిన మంత్రోపదేశంవల్ల పొందిన ఆధ్యాత్మికానుభూతి దోహదం చేసాయని నవలా కథనంలో తెలుస్తుంది. సాంప్రదాయిక భావజాలపు బలంతో స్త్రీలు ఆత్మ సంస్కారాన్ని పొంది పరస్త్రీ వ్యామోహితులయిన భర్తలను సహించే ఔదార్యం రోగాల పాలవుతే సేవలు చేసి పునరుజ్జీవితులను చేసుకొనే క్షమా గుణం పెంచుకోవాలని ఈ నవల చెబుతుంది. స్త్రీలకు తమను సహ భాగ స్వాములుగా గుర్తించి ప్రవర్తించని భర్తలనుండి విడిపోయి స్వతంత్ర వ్యక్తులుగా బ్రతికే ధైర్య స్థయిర్యాలనుగానీ, వైవాహిక వ్యవస్థలో తమకు జరుగుతున్న అన్యాయాలకు నిరసన తెలుపగల వ్యక్తిత్వాలనుగానీ పెంచుకోవటానికి దోహదం చేయకపోగా ఈ నవలేతివృత్తం స్త్రీలను ఆత్మ సంస్కారం పెంచుకోవటం పేరుమీద అతి పాసివ్‌గా తయారు చేయ టానికి తోడ్పడుతున్నది.

మాలతీ చందుర్ వ్రాసిన "ఆలోచించు" అనే నవల ఒకటి వుంది. అందులో లలిత, మూర్తి ప్రేమించుకొని పరస్పర అవగాహనతో అభ్యుదయ పంథాలో వివాహం చేసుకొంటారు. లలిత వ్యక్తిత్వమూ, స్వతంత్ర మయిన ఆలోచనా ధోరణి కలిగిన స్త్రీ. అటువంటి స్త్రీ భర్త మరో స్త్రీని పెళ్ళి చేసుకోవటానికి సిద్ధమయితే తలకిందులవుతుంది. తనే యిటువంటి పని చేస్తే ఇతను అర్థం చేసుకొంటాడా? అని అనుమానపడుతుంది. "ప్రతిసారీ స్త్రీని సహించు, సహనం కోల్పోకు, అర్థం చేసుకో అంటూ అడుగుతారు. తానెందుకు అర్థం చేసుకోవాలి? తానెందుకు సానుభూతి చూపించాలి? తాను పురాణ కాలం నాటి సుమతికాదు. ద్వాపర యుగం నాటి రుక్మిణికాదు. తను వొప్పుకోదు. ఎందుకు వూరుకోవాలి? ఎదిరించి పోట్లాడి తన హక్కు నిలబెట్టుకుంటుంది" (ఆలోచించు, ద్వి. ము. 1981, పు 179) అని అనుకొన్న లలిత "థింక్" అనే చిన్న పుస్తకం ఒకటి చదివి, ఆ తరువాత ఒక స్వామీజీ బోధతో భర్త దృక్పథంనుండి, భర్త పెళ్ళి చేసుకొంటానన్న ఆ రెండవ స్త్రీ దృక్పథంనుండి ఆలోచించి, భర్తతో రాజీపడి ఏమీ జరగనట్లే అతనితో సహజీవనం చేస్తుంది. అంతి మంగా ఈ నవల ఏమి చేసినట్లు? స్త్రీ అంతర్మథనం చెందుతూనయినా సరే భర్తతో రాజీపడి బ్రతకాలి తప్పితే మరొకదారి లేదు – అని చెప్పటం ద్వారా స్త్రీలు ధైర్యంగా పురుషులతో సమానంగా బ్రతకటాన్ని గురించి ఆలోచన చేయకుండా వాళ్ళు తమ జీవిత విధానాలను రాజీ మార్గములో

నడిపించుకొంటూ ప్రక్క త్రోవలను, తప్పుడు త్రోవలను అనుసరించటానికి బలవంతపెడుతున్నది.

కొడాలి సాంబశివరావు అనే ఆయన "కలలదీపాలు" అనే నవల వ్రాశాడు. ఆ నవల కథంతా ఫ్లాష్‌బాక్‌లో నడుస్తుంది. నాయిక టీచరుగా ఉద్యోగం చేస్తూ ప్రేమలోపడ్డ పక్కింటివాళ్ళ అమ్మాయికి అన్యాపదేశంగా తన ప్రేమ కథను, తద్విఫలత్వాన్ని చెప్పటంద్వారా ఆమెను ప్రేమ మార్గంనుండి మళ్ళిస్తుంది. నాయిక తనను ప్రేమించి పెళ్ళి చేసుకొన్నవాడు తరువాత జీవితంలో వచ్చిన యిబ్బందుల నెదుర్కోలేక ఆమెను వదలి వెళ్ళి వేరే పెళ్ళి చేసుకొంటాడు. మొదటి భార్య బ్రతికుండగా రెండవ పెళ్ళి చెల్లనేరదని, కోర్టులో అతనిమీద కేసు పెడదామని ఆమె అన్నగారంటే అందుకు ఆమె ఒప్పుకోదు. అంతా తన దురదృష్టమని వూరుకొంటుంది. ప్రేమించి పెళ్ళి చేసుకొన్న నాయిక ఆ బంధాన్ని నిలుపుకొవటానికి తన వైపు నుండి ఏ ప్రయత్నమూ చేయకుండానే తన జీవితాన్ని కథగా చెప్పి ప్రేమించి పెళ్ళిళ్ళు చేసుకోవద్దని, అందువల్ల వచ్చే కష్టాలను గురించి చెప్పి స్త్రీలను హెచ్చరించటం స్త్రీలను పిరికివాళ్ళుగా చేసేదిగా వుంది తప్పితే సమాజంలో పురుషులతో ఆరోగ్యకరమైన ఆనందకరమయిన స్నేహ సంబంధాలను, ప్రేమ బంధాలను స్వతంత్రించి ఏర్పరచుకోటానికి తగిన ఆలోచనా పరిధిని పెంచేదిగాలేదు.

విజయలక్ష్మి మురళీధర్ వ్రాసిన "మగాడికో నమస్కారం" నవల ఎంతెంత చదువులు చదువుకొని ఉద్యోగాలు చేస్తున్న స్త్రీల పైనయినా యథేచ్ఛగా సాగుతున్న పురుష దురహంకారపు పెత్తనాన్ని చిత్రించినా, దాని మూల కారణాలు, పరిష్కార మార్గాలు చూపించలేకపోవటం వలన స్త్రీలను పురుష వ్యతిరేకులుగానో లేక పురుష పెత్తనాన్ని భరిస్తూ అతనికో నమస్కారం పడేసి నిర్లిప్తంగా బ్రతకటం నేర్చుకోమనే నిరాశాధోరణికి లోనయ్యేట్లుగానో చేస్తున్నది. అయితే రావి భారతి అన్నట్లు "ఒక సమస్యను సమస్యగా చిత్రించటం వేరు, వాటి మౌలిక కారణాలు శోధించి ఆ సమస్యలకు సజీవమయిన అనుభవాల ఆధారంగా పరిష్కార మార్గాన్ని సూచించటం వేరు. ఒక రచయితకు లేక రచయిత్రికి ఎంతో ఆర్థిక సాంఘిక రాజకీయ పరిజ్ఞానం శాస్త్రీయ అవగాహన లేనిదే ఇది సాధ్యంకాదు."[4]

కౌసల్యాదేవి నవల "శిలలూ-శిల్పాలు"లో గిరిజ అనే పాత్ర అత్త గారి వైపు చుట్టాలకు చాకిరి చేయలేక అత్తగారి సాధింపులు పడలేక ఆత్మ హత్య చేసుకొంటుంది. వాసిరెడ్డి సీతాదేవి వ్రాసిన "బంధితుడు" నవలలో పద్మ ఆడబిడ్డ కోరికలను తీర్చటానికి మూర్ఖంగా ప్రవర్తిస్తున్న భర్తమీద విరక్తితో ఆత్మహత్య చేసుకొంటుంది. డి. కామేశ్వరి వ్రాసిన "శిక్ష" అనే నవలలో భార్య శీలాన్ని శంకించిన భర్త తామిద్దరిలో ఎవరో ఒకరే బ్రతి కుండాలని నిర్ణయించి పరోక్షంగా భార్యే మరణించాలని నిర్దేశించి ఆ మేరకు రెండు రోజులలో టెలిగ్రామ్ రావాలని చెప్పి మద్రాస్ వెళ్ళిపోతే ఆ భార్య తన శీలం అనుమానించదగినది కాదని నిరూపించే సాక్ష్యాధారాలతో ఉత్త రం వ్రాసికూడా భర్తగారి నిర్ణయం మేరకు ఆత్మహత్య చేసుకొంటుంది. ఇట్లా శ్రీరామచంద్రుడు అగ్నిలో దూకమంటే దూకిన సీతను స్త్రీలకు ఆదర్శంగా చేసి ఆత్మహత్యలకు పురికొల్పటం స్త్రీలకు సరియైన జీవిత దృక్పథాన్ని చ్చేది కాదు. ఈ రకమయిన నవలలు స్త్రీలకు పరిస్థితులను ధైర్యంగా ఎదుర్కొని తమకనుకూలంగా మార్చుకొంటూ బ్రతికే పట్టుదలను ఉత్సాహాన్ని యివ్వకపోగా ఆత్మహత్యే అన్ని సమస్యలకు పరిష్కార మన్న నిర్ణయానికి వచ్చేట్లు చేస్తున్నాయి. ఇది మరీ దారుణంగా ప్రక్క దారికి నెట్టటం.

యద్దనపూడి సులోచనారాణి తన నవలా నాయకుణ్ని అందమయిన వాడుగా, ఆస్తిపరుడుగా చిత్రించి, నాయికా నాయకులను ప్రేమ, ఆత్మాభి మానం, అపార్థాలు అనే మూడు బుజాలు కలిగిన త్రిభుజంలో తిప్పితిప్పి పెళ్ళి దగ్గరకు తీసుక వెళ్ళటం కనబడుతుంది. ఆమె నవలలో నాయకు లంతా స్వయం ప్రతిభతో వ్యాపారంలో పైకి వచ్చి లక్షలు ఆర్జించినవాళ్ళు. వాళ్ళు సాధారణంగా ఆరడుగుల పొడుగుతో పొడవయిన కార్లలో తిరుగు తుంటారు. ఈ రకమయిన ఇతి వృత్తాలు, పాత్ర చిత్రణలు మధ్య తర గతి కన్యలను వాస్తవ జీవిత భూమికను వదిలి కాబోయే భర్తలను ఆ నాయకులలో వూహించుకొంటూ కలలలో విహరించేట్లు చేశాయి. ఆ రకంగా స్త్రీల ఆలోచనలను వాస్తవిక జీవిత పునాదులనుండి కాక భ్రమల మీద ఆధారపడేట్లు తన రచనా శిల్పం, వర్ణనా చాతుర్యంద్వారా చేసిన సులోచనారాణి ఆ మేరకు స్త్రీలను ప్రక్కత్రోవ పట్టించే ధోరణులను తన సాహిత్యంలో పోషించినట్లే అయింది. యద్దనపూడి సులోచనా రాణిని అనుకరిస్తూ ఈ మధ్య ఆర్. సంధ్యాదేవి అనే ఆవిడ నవలలు వ్రాస్తున్నది.

సులోచనారాణి సాహిత్యంలోకంటె ఎక్కువ అసంబద్ధతతో పైగా అక్కడ లేని అసభ్యతతో ఈ సాహిత్యం వుంది. సులోచనారాణిది ప్రబంధయుగ సాహిత్యంలాంటిదయితే సంధ్యాదేవిది క్షీణ ప్రబంధయుగ సాహిత్యం లాంటిది. ఈ వ్యవస్థ సృష్టించిన వస్తు జాలాన్నంతా సంపాదించి అనుభవించటమే స్త్రీ జీవిత పరమార్థంగా తన స్త్రీ పాత్రల కట్టుబొట్టును రెండు పేజీల కొకసారయినా వర్ణించటం ఈ రచయిత్రి ప్రత్యేకత. స్త్రీ పాత్రలకు తెల్ల చీరలు కట్టి ముత్యాల హారాలు వేసి పురుషుడి భోగానికి సిద్ధం చేసి పెడుతుంది నవలా సాహిత్యం. స్త్రీలు అ ం ద ం గా అలంకరించుకొని, పురుషుణ్ని ఆకర్షించటమే ధర్మంగా చూపే ఈమె రచనలు స్త్రీలను తమ సమస్యల గురించి ఆలోచించనీయకుండా వూహలలో బ్రతుకుతూ బానిస మన స్తత్వాన్ని పెంచుకొని ఈ పురుష స్వామ్య సమాజానికి ఊడిగం చేయటానికి మానసికంగా సిద్ధం చేస్తున్నాయి. కనుక ఇవి తప్పకుండా స్త్రీలను ప్రక్కత్రోవ పట్టించే సాహిత్య ధోరణులనే చెప్పవచ్చును.

భూత ప్రేత పిశాచాలు వున్నాయేమోనన్న నమ్మకం కలిగేట్లుగా 'తులసిదళం' లాంటి నవలలు వ్రాసి తద్వారా జనాన్ని భయ భ్రాంతులను, నిర్వీర్యులను చేయటం తన సాహిత్య ధోరణిగా బయట పెట్టుకొన్నాడు యండమూరి వీరేంద్రనాథ్. అందులో భాగంగానే అతని సాహిత్యం స్త్రీలనుకూడా నిర్వీర్యులను చేసేదిగా ఉంది. తులసిదళంలో అనితపాత్ర, ప్రార్థనలో తల్లి పాత్ర ప్రేమానురాగాల పేరుతో అసందర్భంగా అసహజంగా ప్రవర్తించటాన్ని అది అతి సహజ ప్రవర్తన అన్నట్లుగా చిత్రించిన తీరు, కథన శిల్పం స్త్రీలను త్యాగం పేరుతో తప్పుడు మార్గాలను అవలంభించేట్లు ప్రోత్సహించేవిగా వున్నాయి. ఇంకా ఒకటి రెండు శతాబ్దుల తరువాత ప్రపంచం ఎలా వుంటుందోనన్న వ్యూహాత్మక రచనగా ఆంధ్రభూమిలో సీరియల్‌గా వస్తున్న "ఆనందో బ్రహ్మ" అన్న వీరేంద్రనాథ్ నవల స్త్రీ పురుషుల సంబంధాలు విశృంఖలంగా వుంటున్నాయన్నట్లు తద్వారా వచ్చే గర్భాలను తొలగించుకోవటం స్త్రీకి ఇంటిలో అందరితో మాట్లాడి నిర్ణయించుకొనేంత సాధారణ విషయమవుతుందన్నట్లు స్పష్టం చేసింది. ఈరకమైన రచనలు యువతీ యువకులను లైంగిక సంబంధాల విషయంలో నీతి నియమాల ప్రసక్తి వదిలేసి అనారోగ్యకర అక్రమ సంబంధాల నేర్పరచుకోవటాన్ని ప్రోత్సహించే ప్రమాదముంది.

( సశేషం )

# భూమి ఎలా పుట్టింది?

—యస్. గమనం

పరీక్షల్లో ప్యాసవాలంటే మొక్కుబడి మొక్కుకుని భజన్లుచేయాలనే బాపతు, పరీక్ష ప్యాసవాలంటే గుండ్లు కొట్టించుకొనే బాపతూ వీరంటోకు బ్యాచీ మీకూ తగుల్తుందంటారు. కష్టపడి చదవండర్రా! అని మనంగానీ కాస్త హేతువాదం తలకెక్కించబోయామా! ఇహ చూస్కో! "దేవుడు లేడంటావ్‌గానీ ఈ సృష్టి ఎక్కణ్నుంచొచ్చింది? భూమి ఎలా పుట్టింది? అంటూ హేతువాదుల్లాగా ప్రశ్నలు మొదలెడతారు. మరి మనంకూడా మూర్ఖంగా కొట్టిపారేయకుండా వాళ్ళప్రశ్నలకు ఓపిగ్గా జవాబులివ్వాలి. అలా చెప్పగలిగే విజ్ఞానాన్ని సంతరించుకోవాలి.

భూమి పుట్టుకను గురించి అనాదిగా మానవజాతి ఆలోచిస్తోనే వుంది. ఆ కాలంలో వాళ్ళకు తోచిన సమస్యలు అన్నిటికీ వాళ్ళకున్న పరిమితమైన వనరులతో, కొద్దిపాటి జ్ఞానంతో అనేక సమాధానాలు చెప్పుకుని వాటిని మతంతో ముడి పెట్టడం జరిగింది. అన్ని మతాలు భూమిని దేవుడి సృష్టిగా భావించాయి. భూమి బల్ల పరుపుగా వుండేదని అన్ని మత గ్రంథాలలోనూ వుండేది. హిరణ్యాక్షుడు భూమిని చాపలా చుట్టేశాడని ఇప్పటికీ మన పిల్లలకు నేర్పుతున్నారు. ఆనాడు తెలియక చెప్పిందానినే ఇంత శాస్త్ర విజ్ఞానం పెరిగింతర్వాతకూడా చెప్తున్నారు.

మబ్బులు లేకుండా వున్న నీలాకాశాన్ని రాత్రిపూట పరికించండి. ఆకాశంలో మినుకు మినుకుమంటూ లక్షల కోట్ల నక్షత్రాలు మన కంటికి కనిపిస్తాయి. మనం మామూలుగాచూస్తే అసలు కన్పించకుండా శక్తివంతమయిన టెలిస్కోపులతో కనబడేవి, టెలిస్కోపుకుకూడా అందనివీ ఎన్నో వుంటాయి. వాస్తవానికి కోటానుకోట్ల నక్షత్రాలతో కూడివున్న గెలాక్సీలెన్నో మనకు మినుకు మినుకుమంటూ నక్షత్రాల్లా కనబడుతుంటాయి.

ఆకాశంలో "కాశీ రామేశ్వర మార్గ"మనీ, "పాలపుంత" అనీ పెద్దవాళ్ళు నక్షత్ర సముదాయాన్ని మనకు చూపెడుతుంటారు. అనంతకోటి

నక్షత్ర సముదాయాలలో స్ప్రింగు ఆకారంలో వుండే ఓ గెలాక్సి (స్పైరల్ గెలాక్సి)లో శత సహస్రాంశమయినా లేనంత చిన్నది మనకు వెలుగునిచ్చే సూర్యుడు (సన్) అనబడే నక్షత్రం. అది గెలాక్సితోబాటుగా విశ్వంలో ప్రచండ వేగంతో పరిభ్రమిస్తూ తనతోబాటుగా తనకు ఉపగ్రహమయిన భూమితో సహా మిగతా ఏడు గ్రహాల్నీ, వాటికి ఉండే ఉపగ్రహాల్నీ తన చుట్టూకూడా తిప్పుకొంటూ వుంది. ఒక్క మాటలో చెప్పాలంటే అణువు నుండీ అనంతం వరకూ నిరంతరం చలనంలో వుందన్నమాట.

అంటే మొత్తం కోటానుకోట్ల నక్షత్రాలన్నీ ఇంచుమించుగా సూర్యునంతటివేనని, ఒక్కో నక్షత్రమూ ఒక్కో సూర్యుడని, మీకర్థమయింది కదూ! అయితే ఇప్పుడో ప్రశ్న వస్తుంది. "ఈ సూర్యుడు మనకింత వెలుగునూ భరించలేని వేడిమినీ ప్రసరింపజేస్తోండగా మిగతా నక్షత్రాలన్నీ వేడి, కాంతి ఇవ్వకపోయినా కనీసం పగటిపూట కనుపించనయినా కనుపించవేమిటి?" అవి అలా కనుపించకపోవడానికి ముఖ్య కారణం అవి ఎన్నో కోటానుకోట్ల మైళ్ళ దూరంలో ఉండటమే. ఈ నక్షత్రాలు భూమినుంచి ఉన్న దూరాన్ని కొలవడానికి కాంతి వేగాన్ని ఉపయోగిస్తారు. కాంతి వేగం అంటే కాంతి ఒక సెకనుకు మూడు లక్షల కిలోమీటర్లు (ఒక లక్షా ఎనభయ్యారువేల రెండు వందల చిల్లర మైళ్లు) ప్రయాణం చెయ్యడానికి కేవలం ఒక్క సెకను మాత్రమే తీసుకొంటుంది. సెకను కాలం అంటే మీకు తెలుసుకదూ! ఒక నిముషానికి అరవై సెకండ్లు. ఇతర నక్షత్రాల్ని (సూర్యుళ్ళని) ఎంత దూరం ఉందీ కొలిచి చెప్పేందుకు, ఆ నక్షత్రం ఎన్ని కాంతి సంవత్సరాల దూరంలో చెపుతారు. అనంతమయిన వాయు ధూళి మేఘం నుంచి చిమ్మిన వాయువుతో మన సూర్యకుటుంబము, ఇతర నక్షత్రాలూ వున్న "పాలపుంత" (Milky way Galaxy) అనే గెలాక్సి పదివేల మిలియనుల సంవత్సరాల క్రితం ఏర్పడ్డాయని శాస్త్రవేత్తల అంచనా. ఆ వాయు ధూళి మేఘం చిన్నచిన్న ముద్దలుగా ఘనీభవించి కోటానుకోట్ల నక్షత్రాలుగా విభజితమయింది. మన భూమి ఉపగ్రహంగా వున్న మన సూర్యగోళం షుమారుగా నాలుగువేల అయిదువందల మిలియనుల సంవత్సరాల క్రితం ఏర్పడింది.

ఆ సూర్యగోళంనుంచి తెల్లని అత్యంత వేడి అయిన పదార్థ రాసులు కొన్ని విడి పడి సూర్యగోళం చుట్టూ తిరుగుతూ దానికి ఉపగ్రహాలుగా

ఏర్పడ్డాయి. అందే కేంద్ర స్థానంగా మండే తెల్లని పదార్థంతో సూర్యు డుంటే చుట్టూ చిన్న చిన్న గ్రహాలేర్పడ్డాయి. వాటిలో మన భూమి ఒకటి.

భూమి అంటూ అప్పుడేమీ ఉండేది కాదు. ఉండిందంతా మండే తెల్లటి వాయువు ముద్ద. అదంతా ఘనీభవించి ఇప్పటి రూపానికి రావడా నికి కోటానుకోట్ల సంవత్సరాలు ప ట్టిం ది. జియాలజి (Geology) (భూమిని గురించి పరిశోధించే శాస్త్రం) అధ్యయనంచేసే శాస్త్రవేత్తలకు భూమి పుట్టి ఎంత కాలం అయియుంటుందన్న విషయం యాభై అరవయ్యేళ్ళ క్రితం వరకూ చాలా కష్టతరంగా వుండేది. సైన్స్ అంటే మతాచార్యులు, మత గ్రంథాలూ తమ నోటికి వచ్చినట్లు చెప్పడంవంటిది కాదు గదా! ఇవన్నీ తార్కికంగానూ, భౌతికంగానూ అనేక పరీక్షల తర్వాత నిర్ధారించ బడతాయి. భూమి పుట్టుకను గురించి కనుక్కోవడానికి రేడియాక్టివ్ సిద్ధాంతం చాలావరకూ తోడ్పడింది.

యురేనియం అనే లోహం దీర్ఘకాలానంతరం "సీసం" (Led)గా మార్పు చెందుతుంది. ఉ॥కు ఒక గ్రాము యురేనియం వెయ్యి సంవత్స రాల కాలంలో డెబ్బయి లక్షవ వంతు సీసంగా మారుతుంది. భూమిపై నున్న సిలల్ని ఈ పద్ధతిద్వారా పరిశీలించి, దాని వయస్సుకు షుమారుగా నిర్ధారణ చెయ్యడం జరుగుతుంది. ఇప్పటివరకూ దొరికిన సిలల్ని పరిశీ లించి వాటిలో అత్యంత పురాతనమయిన దాని ఆధారంగా మూడువేల అయిదువందల మిలియన్ సంవత్సరాల క్రితం భూమి రూపు దిద్దుకోవడం ప్రారంభించినట్లుగా తెలుస్తోంది.

భూమిపైన అనేకమయిన మార్పులు జరిగాయి. ఎర్రటి మండే బంతిలా వుండే మన భూమి ఒక దశకువచ్చి పర్వతాలు, నేల, సముద్రమూ ఏర్పడటానికి కోటానుకోట్ల సంవత్సరాల ప'ణామ క్రమం కా వా ల్సి వచ్చింది. మరెన్నో కోట్ల సంవత్సరాల తర్వాతగానీ ఈ భూమిపై ఆకాశం అనే మేఘాలపొర ఏర్పడి (Ozonlayer) సూర్యకాంతి ఈ భూగోళంపై పడకుండా ఆపటమూ తర్వాత భూమిపై తొలి జీవాణువు డేఆవిర్భవించడమూ జరిగాయి.

ఆ వేడి పూర్తిగా పోయి భూమి చల్లబడి పోయిందనుకోకండి. భూమిని నిమ్మకాయులాగా కోసి మధ్య భాగం చూసేట్లయితే మరుగుతున్న

[మిగతా 35వ పేజీలో]

కథానిక.........

# ఉద్భవం

రచన : మహోదయ

నాగ దేవత వెలిచింది. రండిరో, చూసొద్దాము.

నరసింహం గట్టిగా చెప్పి పరుగు లంకించుకున్నాడు. అతని వెనుక స్కూలు పిల్లలు చాలామంది ఆసక్తితో పరుగెత్తారు.

మా స్కూలుకి పర్లాంగు దూరంలో శంకరగిరి మాన్యాల కట్టవద్దకు పరిగెత్తారు. అప్పటికే అక్కడికి చేరిన గ్రామప్రజలు రాయిమీద వెలిచిన నాగదేవుడికి మొక్కుకుంటున్నారు. అక్కడ గుబురుగా వివిధ చెట్లు, తాటిచెట్టుని పెనవేసికొని రావిచెట్టు పెరిగింది. దాని మొదట్లో ఒక రాయి కొంత భూమిలోనికి ఉంది. పైకి వున్న రాయిపై పాము ఆకారంలో శిల్పం. ఆ రాయి చుట్టూ శుభ్రంచేసి కళ్ళాపి జల్లి ముగ్గు పెట్టిందో ముసలమ్మ. రాయికి పసుపు రాసి కుంకుమ బొట్లెట్టి ఉన్నాయి. దాని ముందో చిన్న రాయి. రెండు అరటిపళ్ళు ఉన్నాయి. అరటి పళ్ళకు అగరవత్తులు గుచ్చి వుండి కాలుతున్నాయి.

మొన్న నాను చితుకులేరుకుందామని ఇటు వచ్చాను. నాకు పది బారల పొడుగున్న నాగదేవుడు కనపడ్డాడు. బుస్సుమంటూ అంతెత్తున (చెయ్యెత్తున) లేచి పడగ విప్పి ఆడాడు. నేను భయపడ్డాను. రెండు చేతులు జోడించి దండం పెట్టుకున్నాను. అంతే చిటికెలో మాయమయ్యాడు. గొప్పలు పోతూ చెప్పిందా ముసిలావిడ.

నాగమ్మా! నాగదేవత ఎలా ఉంది? ఎవరో ప్రశ్నించారు. తెల్లగా వెండిలా మెరిసిపోతున్నది. సీతమ్మోరి పాదాలు చాటలంత ఉన్నాయి. చూట్టానికి రెండు కళ్ళు చాలలేదంటే నమ్మండి.

పడగ విప్పినపుడు ఎంతున్నది? మరొకరి ప్రశ్న.

అబ్బో (రెండు చేతులు చాచి) నా జానతో పెండెంతలు పైగా వుంటుం దంటే నమ్మండి. అసలు వారం పది రోజులుగా నాకు కలలో కొస్తానే ఉన్నది. తీరా మొన్న ప్రత్యక్షమైనాది. అప్పుడెనో ఇక్కడ చతికిల

పడ్డా ?ు చేతికి పాము తగిలినట్టుంటే ఏమిటా అని చూశాను. ఇలా భూమిల నుండి పైకి వచ్చాడు.

ఈ మాటలు చెప్పి ఎవరో కొబ్బరికాయ తెస్తే గబగబా తీసికుని రాయి చుట్టూ తిప్పి దాని ముందుంచిన చిన్న రాయిపై దబి దబి బాది, రెండు చిప్పలలో నీరు రాయిపై చిమ్మి కొబ్బరి చిప్పలక్కడ పెట్టి దండం పెట్టుకుందా నాగమ్మ.

చైతన్య మాస్టారు వస్తున్నారు. అంటూ పిల్లలు గుసగుసలాడారు.

నేను గ్రామ పెద్ద "నాగ దేవుణ్ని" గు రిం చే మాట్లాడుకుంటూ అక్కడకు చేరుకున్నాం. అప్పటికే నేను అక్కడ జరిగేవన్ని విన్నాను.

మాట్టారు దేవుళ్ళను నమ్మరుగా, అంటూ నవ్వి ఇప్పొడేమంటారు. అంటూ ప్రశ్నించాడు నాకు తెలిసిన రైతు. ఇలాంటి ప్రశ్న ముందే వస్తుందని తెలిసి ఆలోచించుకుంటూ వచ్చాను.

పాము, పాము, పాము అంటూ బిగ్గరగా అరిచాను ఓ వైపు వ్రేలు పెట్టి చూపుతూ. అంతే, అక్కడ చేరిన జనం భయంతో పరుగులెత్తారు. ముసలమ్మ వణుకుతూ రాయికి దణ్ణం పెడుతూ నించుంది. కొందరు చెట్లెక్కారు. కొందరు దూరంగా పరుగెత్తారు. కొందరు వెనక్కు తిరిగి చూడకుండా ఇళ్ళకు పారిపొయ్యారు.

నేను, గ్రామ పెద్ద, ముసలమ్మ అక్కడే ఉండటం చూసి కొందరు తిరిగి వచ్చారు. కొందరు చెట్లు దిగి వచ్చారు.

పామెటుపోయిందండి? ఆయాసపడుతూ ప్రశ్నించాడొకతను.

పోలేదు. చచ్చింది. మన ఏనాది వెంకన్న చంపాడు అన్నాను.

అయోమయంలో పడి, రకరకాల ప్రశ్నలు వెయ్యటం ప్రారంభించారు.

మీకు పాముకనిపించిందా? అని ప్రశ్నించాను వాళ్ళను. కనిపించినట్లు (అవునన్నట్లు) తలలూపారు కొందరు. సందేహంగా చూస్తున్నారు కొందరు సమాధానం చెప్పటం తెలియక.

"మీకు పాము కనపడలేదు. భ్రమ పడ్డారంతే అన్నాను."

ఏంటండి మాస్టారు. మీరెప్పుడు యిలాంటివే చేస్తారు. ఇసుక్కున్నారు కొందరు.

ఆ పాము నిజంగా చచ్చింది. రండి చూపిస్తాను. అంతా నా వెంట వచ్చారు. అక్కడికి కొంత దూరంలోగల చర్మం వొలిచేసిన పాము కళేబరాన్ని చూపాను వారికి.

"అరె ఎవరో ఏనాదోడు చర్మం వొలిచేసిన పామురా ఇది" అన్నాడొకడు. ఎప్పుడు చంపారబ్బా? సందేహం వెలిబుచ్చారొకరు, ముసలమ్మ పాము దగ్గరకు వంగి కుళ్ళు వాసనను కూడా లెక్కచేయకుండా ఆశ్చర్యంగా చూస్తోంది.

ఈ పామే ముసలమ్మ నీవు చూసింది. తెల్లత్రాసు. నిన్న ఏనాది వెంకన్న పట్టుకుని చర్మం వొలిచి పట్టుకుపోయాడు అన్నాను.

"నిజమే నేనూ చూశా." జనంలో నుండి ముందుకొచ్చి చెప్పాడా వ్యక్తి. అకట్టవా చుట్టా పొలంగల రైతు రామయ్యా అతను.

రండి! ఈ పాము కథ నాకు తెలుసు, నేను చెప్తాను. అంటూ రావిచెట్టువైపు నడిచాను. చెట్టువైపు వెళ్ళేప్పుడే ఏనాది వెంకన్నను పిలుచుకు రమ్మని ఒకళ్ళకు పురమాయించాడు మా గ్రామ పెద్ద.

ఏంటండి! ఇదంతా యింతగా వుంది. అసలేం జరిగిందో చెప్పండి? మా గ్రామ పెద్ద ప్రశ్నించారు.

అందరూ ఆసక్తిగా వినటానికి ముందుకు జరిగారు.

నేను స్కూలు వదిలాక షికారుకి ఈ తోటవైపు రావటం మామూలే. ఇదిగో ఈ రాయిపై (నాగ దేవుడు వెలిసిన రాయిని చూపుతూ) కాసేపు కూర్చొని చీకటిపడేవేళ ఇంటికి వెళుతుంటాను. ఆ వేళలలో ఈ పాము ఆహారానికి బయలుదేరి గడ్డిలో, ఎండుటాకుల్లో జరజరాపాక్కుంటూ పోతుండటం నేనెన్నోసార్లు చూశాను.

కరవలేదా మాస్టారూ? ఐదారుగురు ఒకేసారి ప్రశ్నించారు. పాములకు మనిషిని చూస్తే భయం. అవి సహజంగా మనుషుల్ని చూసి పారిపోతాయి అన్నాను. ఔనండి అంటూ ముందుకొచ్చాడు రామయ్య.

ఆ పాము మా చేలల్లో తిరుగుతూ అనేకసార్లు కనిపించింది. తెల్లత్రాసు. చంపుదామంటే దొరికేదికాదు అని భయం వదిలింది అన్నాడు.

విషమున్న పాములకుగాని, విషములేని పాములకుగాని దైవ శక్తులేం ఉండవు. రాయిమీద ఎలవటం వట్టిది అంటూ రాయిని కదిలించి పీకి ముందుకు పడవేశాను.

అక్కడకు చేరినవాళ్ళు వ్యంగ్యంగా నవ్వుకున్నారు. "మరయితే మన ప్రక్క గ్రామంలో చెరువుకట్టన "పితుళ్ళమ్మ" దేవతగుడి ఉందిగా అది ఇట్టా వెలిచిందేనా?" అని ప్రశ్నించాడో ఆసామి.

అది ఇట్లాంటి బూటకమే. మన మతంలోనే బొమ్మరాళ్ళుగా భూమిలో నించి పుట్టుకొస్తున్నారుగాని, ఈ దేవతలు మరి ఇతర మతాలలో దేవుళ్ళు ఎందుకు పుట్టుకరావటంలేదు? పుట్టగొక్కుల్లా భూమిలోంచి పుట్టుకు వస్తారా దేవుళ్లు? నా ప్రశ్నలు వాళ్ళను ఆలోచింపజేస్తున్నాయి. ఇంతలో వెంకన్న వచ్చాడు.

ఆ పాముని నిన్ననె పట్టుకుని చర్మం ఊడలాక్కుపోయా. నాగు దేవుడెట్టా అవుద్ది. జనాలు పక్కున నవ్వారు.

ఆ రాయిని ఒకడు నెత్తిమీదకెత్తుకున్నాడు. మాదొడ్లో బట్టలుతుక్కం టానికి పనికొస్తుందంటూ మోసుకుపోయాడు.

బాపే నీ చాదస్తంకూల, మాకు కదలే దేవుణ్ని చూపించావు. నాగమ్మను కసిరాడు గ్రామ పెద్ద.

చమించండి. ధర్మ డిబ్బి పెట్టి బతకొచ్చనుకున్నాను. కొబ్బరి చిప్పలు తీసికుని సదుక్కుంటు ఇంటిదారి పట్టిందా ముసలమ్మ.

సందేశం : భూమిలో నుండి బొమ్మరాళ్ళుగా పైకి వచ్చే దేవుళ్ళను పెకలించి పారెయ్యటానికి సంకల్పించండి. ★

---

(31వ పేజీ తరువాయి)

లోహపు ద్రవమూ, అంతకు ఎన్నో రెట్ల వేడి ఉండే తెల్లటి మండే పదార్థమూ ఉంటాయి. భూగోళంలో ఓ ముప్పయి నలభయి మైళ్ళ లోతు తర్వాత ఇనుము, మెగ్నిషియం, సిలికేట్లవంటి మరుగుతుండే లోహ ద్రవాలు (షుమారుగా రెండువేల తొమ్మిదివందల కిలోమీటర్ల లోతు వరకూ) ఆ పైనమండే వాయువుగావుండే ఇనుమూ ఉంటాయని అంచనా.

మీరు పాఠాలలో అగ్ని పర్వతాల్ని గురించి చదువుకున్నారుకదూ! కొన్నిచోట్ల భూగర్భంలోంచి మండే లావామంటలు విరజిమ్ముతూ భూమిపై మైళ్ళ కొలదీ పారుతుంది. అదే కాల క్రమేణా సస్యశ్యామల మయిన భూమిగా పరిణామం చెందుతుంది. దీనిపై మరింత వివరంగా పెద్దలతోనూ, ఉపాధ్యాయులతోనూ మరింతగా చర్చించి తెలుసుకుంటారు కదూ! భూమిపై జీవావిర్భావం గురించి త్వరలో తెలుసుకుందాం.

(సశేషం)

## కత యిది కాదుర పెద్దన్నా !

కుండా చట్టీ మూట కట్టుకొని
ఉండా బిడ్డల నెంట బెట్టుకుని
మాసం గాసం కోసం పాపం
దేశం దేశం తిరిగే పేదల
బతుకులు మారేదెపుడన్నా?
కత యిది కాదుర పెద్దన్నా!!

చంక నున్నా చంటి దానికి
చన్నుగుడపను పాలు లేవు;
వెంట నున్నా పిల్లగాడికి
కడుపు నిండా గంజి లేవు;
ఆలు మగల సంగతింకా
ఆలకించే దెవ్వరన్నా?

అదిగదిగో.... ఆమడ దూరంలో
నదిలా ఉరుకుతు మంచి కాలం
వస్తుందోయని చెప్పిరెందరో
వస్తే చూసే మస్తానెల్లే!
మాటలు మిన్నా – చేతులు సున్నా
కాదనలేరి మాటెవరన్నా!!

ఆకలి తెలిసిన వాడెవడన్నా
అధికారంలో కొస్తేగాని,
దేవుడు రాసిన రాతిది అనుకొను
దేబిరి మొకలు పోతేగాని,
పనికి తగ్గ ఫలితముండదన్నా
మనిషి మనిషిగా బతకడన్నా!!

— జొన్నలగడ్డ మోహన్‌ప్రసాద్

# మతవాద మారణకాండ

రచన : తథాగతుడు

మందిరాలెందుకు
భక్తి ముక్తి సాధనకా?
అమాయకుల హతమార్చే
దుర్మార్గుల రక్షణకా;
స్వర్ణాలయ సముదాయం
అయినది హంతకులకు నిలయం!
మతోన్మాదులు ప్రేల్చిన గుండ్లు
జనానికి ఎనలేని కడగండ్లు;
అవి దేవుని దెబ్బలా?

దేవునికి దెబ్బలా?
ఏదైనా, న్యాయానికి గాయాలు,
మానవతకు మాయని కళంకాలు
మతమివ్వగలిగేది మౌఢ్యం,
మరణం;
పంజాబులో మతవాదుల
మారణహోమం
మరోసారి దొరికిన మహోన్నత
తార్కాణం.

## ఏది మనది?

—మా. శ్రీ రాజు

అజ్ఞానంలో పుట్టి–
అంధకారంలో పెరిగి,
అందర్నీ విడదీసి–
అందర్నీ దోచుకొనేది మతవాదం!

విజ్ఞానంలో పుట్టి–
వికాసంలో పెరిగి,
అందర్నీ కలిపి–
అందర్నీ నడిపేది హేతువాదం!!

## నాడు – నేడు!

—చెంగల కృష్ణమూర్తి

రాముడు రాజుగా
వున్నప్పుడే....
పూజించలేదు
నాటి ప్రజలు!
మరి—
రాతిబొమ్మగా

మలిచిన రామునిప్పుడు
పూజిస్తున్నారెందుకు
నేటి ప్రజలు?
వాళ్ళకంటే
వీళ్ళెంతటి మూ........?

• కాలు జారడం నేరంకాదు. కారణం తెలుసుకోలేకపోవడం ఘోరం!!

—శ్రీ శ్రీ

# మనసు - మర్మాలు తెలిపిన ఫ్రాయిడ్

"పల్లవి"

ఒక స్త్రీ స్పృహ లేకుండా, కాళ్ళు చేతులు కొట్టుకుంటూ నురగులు క్రక్కుతుంటే ఆమెకు దయ్యము, గాలి పట్టిందని చెప్పుతోనూ, చీపురుతోను కొట్టి హింసించే మూర్ఖులను చూస్తున్నాం. మానసిక రోగుల కాళ్ళకు సంకెళ్లువేసి నానావిధాల బాధించే అజ్ఞానుల గురించి వింటున్నాం. ఆ భూత వైద్యులను, అభూతవైద్యుల మోసాలనుగూర్చి తెలుసుకుంటున్నాం.

వీటిని గూర్చి వంద యేండ్ల క్రితమే శాస్త్రీయదృష్టితో ఆలోచించిన మనస్తత్వ శాస్త్రవేత్త సిగ్మండ్‌ఫ్రాయిడ్. ఆయన పరిశోధనలు సైకాలజీకి మూల స్థంభాలుగా ఎలా నిలిచాయో చూద్దాం.

ఫ్రాయిడ్ 1856లో పుట్టాడు. ఆయినది మొదటినుంచీ శాస్త్రదృష్టి. తన 20వ యేట ప్రారంభించి ఆరేళ్ళు జీవ భౌతిక శాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. తరువాత కొంత కాలం శరీర నిర్మాణ శాస్త్రం చదివాడు. కానీ ఆర్థిక ఇబ్బందులవల్ల కొనసాగించలేకపోయాడు. నరాల జబ్బుల నిపుణుడిగా తయారు కావాలనుకున్నాడు. 29వ యేట పారిస్ వెళ్ళి ప్రఖ్యాత న్యూరాలజిస్టు చార్‌కాట్‌కు సహచరునిగా చేరాడు.

ఆయన ప్రోత్సాహంతో హిస్టీరియా గూర్చి పరిశోధనలుచేసి అది జబ్బు అని కనుగొన్నాడు. హిప్నాటిజంద్వారా రోగికి విశ్రాంతి ఇచ్చి ప్రశ్నిస్తూ, అతను చెప్పేది వినడం (Free Association) ద్వారా కొన్ని క్రొత్త విషయాలు గ్రహించాడు.

"కోరికలను, ముఖ్యంగా లైంగిక కోర్కెలను బలవంతంగా అణగద్రొక్కడంవల్ల నరాల వ్యాధులు వస్తాయి. హిస్టీరియా అలాంటి జబ్బు. సెక్సు భావాలు బాల్యంనుంచే మనిషిలో వుంటాయి. పిల్లలలో అసూయ ఏర్పడటానికి సెక్సు ఆలోచనలు కారణం. ఒక వ్యక్తి కలల గురించి విశ్లేషణ జరిపి అతని కోర్కెలు తెలుసుకోవచ్చు. మతిమరపు, హాస్యం, ఉద్రేకాలు వంటి వాటినికూడా శాస్త్ర పరంగా పరిశీలించవచ్చు". అని తెలిపాడు. పది సంవత్సరాలు తీవ్రంగా కృషిచేసి "మానసిక విశ్లేషణ"

Psycho Analasis అనే విధానాన్ని రూపొందించాడు. దీని ద్వారా మానసిక వ్యాధికి కారణం కనుగొని దాన్ని తొలగించే వీలు కలిగింది.

ఈ విప్లవాత్మక పరిశీలనలను, ఫలితాలను, సామాన్యులు ప్రపంచం అంతటా ఆసక్తిగా తెలుసుకోసాగారు. కానీ చాలామంది వైద్యులు మాత్రం వీటిని అంగీకరించలేదు. పైగా ఆయన చెప్పేవి విని ఎదురుగానే నవ్వి ఎగతాళి చేసేవాళ్లు. ఇంకా కొందరు వ్యతిరేకించేవాళ్లు.

నిద్ర, ఆకలి, కామం వంటి ఇంద్రియ సంబంధమయిన కోరికలు సహజమయినవి. (Id) అయితే అన్ని కోర్కెలను పూర్తిగా తీర్చు కోవడం ఎవరికీ సాధ్యంకాదు. ఈ కోరికలను అణచివేసేది "సూపర్ ఎగో". కాని అలా అణచి వేస్తే మనసులో వత్తిడి, మనిషిలో ఆందోళన పెరుగుతుంది. అనారోగ్యం కల్గుతుంది. అందుకని కోరికలను వీలయి నంత వరకు తీరేలాగా మధ్యే మార్గం చెపుతుంది "ఎగో" Ego.

ఉదాహరణ: ఒక మంచి పుస్తకాన్ని చూడగానే కొనాలనేది 'కోరిక.' కానీ అంత డబ్బు నీవు పెట్టలేవు. అది రోజూ పనికివచ్చేది కాదు. ఆ డబ్బుతో వేరే అవసరాలు తీర్చుకోవచ్చు. కాబట్టి వద్దు అంటుంది సూపర్ "ఎగో".2 అపుడు మధ్యే మార్గం చెపుతుంది "ఎగో". పుస్తకం పేరు వ్రాసుకో. దాన్ని లైబ్రరీనుంచి కానీ, అద్దెకుగాని తెచ్చుకొని చదువుకో వచ్చు అని- ఇలా అంతవరకూ అంతు చిక్కని మనసు మర్మాలను వివరిం చాడు. తల్లిదండ్రులచేత బాగా దెబ్బలు తిన్న పిల్లలు పెద్దయ్యాక హింసా మార్గాన్నే అవలంభిస్తారు. వ్యక్తి ప్రవర్తనపై అతని గత జీవిత సంఘట నల ప్రభావం ఉంటుంది అనికూడా చెప్పాడు.

ఫ్రాయిడ్ సిద్ధాంతాలలో కొన్ని అసంపూర్ణాలని తరువాత తెలిసినా ఆయన మనస్తత్వ శాస్త్రానికి అందించిన విజ్ఞానం అమూల్యమయినది. ఇంతటి ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్త, మానవాళికి మేలుచేసిన మేధావి 1937లో నాజీల దండయాత్రవల్ల వియన్నా వదలి లండన్‌లో శరణార్థిగా వుండి మరునటి యేడాది మరణించాడు. అయినా ప్రపంచం ఆయనను మరువలేదు. ★

---

* నిరంతరం అధ్యయనం చేసే ఆచార్యుడే శిష్యులకు బోధించగలడు. వెలుగుతున్న దీపమే మరో దీపాన్ని వెలిగించగలదు.

—హుమయూన్ కబీర్

# హేతువాద ఉద్యమంమీద వచ్చిన విమర్శకు సమాధానం

ఆంధ్రప్రదేశ్ హేతువాదసంఘం ప్రధాన కార్యదర్శి కత్తి పద్మారావు గారు "కేకలు" పత్రిక ఇంటర్వ్యూలో హేతువాద ఉద్యమ విధానం గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలమీద లక్ష్మిగారు చేసిన విమర్శకు స్వర్ణకుమారి గారు యిచ్చిన సమాధానం క్రింద ప్రచురిస్తున్నాం. —(ఎడిటర్)

---

కన్నెపల్లి లక్ష్మిగారు హేతువాద ఉద్యమం మత వ్యతిరేక ఉద్యమమే కాని, సామాజిక ఉద్యమంకాదని వ్యాఖ్యానించారు. కేవలం మత నిర్మూలన ఉద్యమంగాచిత్రించారు. కాని హేతువాదసంఘం తన ప్రణాళికలో "సంఘ పరమయిన సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక అసమానతలను శాస్త్రీయంగా హేతుదృష్టితో విశ్లేషించి ఆ అసమానతలనిర్మూలనకు కార్యాచరణ ద్వారా ప్రజలనుచైతన్యవంతులనుచేయడం హేతువాదఉద్యమ లక్ష్యంగా" పేర్కొంది. దీనినిబట్టి హేతువాదఉద్యమం కేవలం మత నిర్మూలనే ధ్యేయంగా పనిచేయడం లేదని దానికి విస్తృత పరిధి వుందని వ్యక్తమవుతుంది. అంతేగాక హేతువాద ఉద్యమం తన కార్యక్రమాలమగూర్చి ఈ విధంగా తెలిపింది.

"సామాజిక, భౌతిక హేతువాద ఉద్యమంగా సాగిపోయే క్రమంలో ఉద్యమం ఈ లక్ష్యాలను సాధించడానికి కృషి చేస్తుంది.

1) ఆర్థిక దోపిడీ నిర్మూలనం. 2) సామాజిక అసమానతా నిర్మూలనం. 3) కుల మతాంధకార నిర్మూలనం. 4) స్త్రీ దాస్య నిర్మూలనం. 5) సాంస్కృతిక వికాసం కలిగించం. 6) సామాజిక భౌతిక దృక్పథం పెంపొందించటం. 7) శాస్త్రీయ విద్యాబోధనం. 8) శాస్త్రీయ వైద్య ప్రచారం. 9) శాస్త్రీయ భౌతిక కళారూప వికాసం. 10) సమసమాజ నిర్మాణ కార్యాచరణ. దీనినిబట్టికూడా హేతువాద ఉద్యమం కేవలం మత నిర్మూలనే ప్రాతిపదికగా నిర్మించుకోలేదని తేలుతుంది.

లక్ష్మిగారు హేతువాదులనుగూర్చి ఇలా అంటున్నారు. విప్లవాన్ని మేం సమర్థిస్తాం కానీ విప్లవ కారులం మేము కాము. మేము సామాజిక

విప్లవకారులం. మేము మతాన్ని నిర్మూలించే విప్లవ కారులం అని ఏదో విధంగా విప్లవం తొడుగును హేతువాదులు ధరించడానికి ప్రయత్నిస్తున్నారు" అని, మేము విప్లవకారులం కాదు అని హేతువాదులు ఏనాడు చెప్పుకోలేదు." "విప్లవం" ఒక "తొడుగు" కాదు, ఎవరు పడితే వారు తొడుక్కోవడానికి. అది ఒక కార్యాచరణ. జీవితంలోనూ, పోరాటంలోనూ విప్లవ భావాన్ని చూపించ గలగాలి. హేతువాద సంఘానికి "సామాజిక విప్లవం" మారుపేరు కాదు. సామాజిక విప్లవం లక్ష్యంగా హేతువాద ఉద్యమం కృషి చేస్తుందని అర్థం. ఆ విషయాన్ని తన గమనంలో నిరూపించుకొంటుంది ఈ ఉద్యమం.

మళ్ళీ లక్ష్మిగారు తొందరపాటుగా ఇలా వ్యాఖ్యానిస్తున్నారు.— "విప్లవం" అనే పదంను ఇష్టమొచ్చినట్లుగా వాడటం ఈ రోజులలో ఒక "షో"గా తయారయింది. రంగుల విప్లవం, హరిత విప్లవం" వాల విప్లవం మొదలగు పదాలు సోషలిజాన్ని దోపిడీలేని వ్యవస్థను తీసుకొని వచ్చే ఉద్యమాలనే "విప్లవం" అంటారు. సామాజిక విప్లవం ఒకటీ, రాజ్యాంగ విప్లవం ఒకటీ, సాయుధ విప్లవం ఒకటి అంటూ వేరువేరుగా ఉండవు."

ఈ విమర్శ శాస్త్రీయంగాకాక ఎదుటి వారిని హేళనచేసే విధంగా వుంది. "విప్లవం" షోకులుగా పాలకవర్గాలు అప్పుడప్పుడూ చేసుకోవడం కద్దుకాని హేతువాద సంఘాన్ని అవగాహన లేకుండా అదే తిట్టు తిట్టడం అర్థ రహితం. విప్లవం అంటే పరిణామం, మార్పు, ఆమె "సామాజిక విప్లవం" అనే పదాన్ని "షోకు"గా భావించారంటే భాష, భావం, పరిశీలన, విశ్లేషణకు సంబంధించిన సమన్వయం ఏమీ లేకుండా ఆమె చర్చకు దిగారు అని తెలుస్తూ వుంది. ఏ సమాజంలో విప్లవం లేవడానికి ప్రయత్నిస్తున్నామో, ఆ సమాజ గర్భంలోకి చొచ్చుకుపోయి ఏఏ రంగాలలో ఆ సమాజం వెనుకబడి వుందో, ఎన్ని రంగాలలో నుండి ఆ సమాజాన్ని విప్లవీకరించాలో తెలిసికోకుండా అధ్యయనం చేయకుండా పిడివాదంతో ఇతర సంఘాలను దూషించడమే పనిగా పెట్టుకోవడం వలన వీరు సామాజిక విప్లవోద్యమాలకు ద్రోహం చేస్తున్నారు. పాలకవర్గాలు ప్రజల చైతన్యాన్ని హరిస్తున్న ధోరణులను, ప్రజలలో నిరంతరం జరుగుతున్న కుల మత ప్రాంతీయ సంఘర్షణలకు మూలాన్ని గమనించకుండా యీ రాజ్యం వచ్చినపుడు అన్నీ పోతాయి. అప్పటివరకు వారిని అలాగే కొట్టుకు చావనీయం

డనడం అవివేకం. మత నిర్మూలనతోనే విప్లవాలు వస్తాయని హేతువాద ఉద్యమం ఎప్పుడూ చెప్పలేదు.

భారతదేశ తరతరాల చరిత్రను, సంస్కృతిని, అర్థం చేసుకొంటూ ఆర్థిక పోరాటాలకు ప్రజలను సన్నద్ధంచేసే క్రమంలో అడ్డువస్తున్న కుల మత శక్తులను రూపుమాపడానికి కృషిచేయాలని హేతువాద ఉద్యమం చెపుతూ వుంది. మన సుదీర్ఘమయిన కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో కుల మతాల సంగతి పట్టించుకోకపోవడం వలన జరిగిన అనర్థం మనకు చరిత్ర చెబుతూనే వుంది. కన్నెపల్లి లక్ష్మి వంటి వారు హేతువాద ఉద్యమం విప్లవ ప్రతీఘాత శక్తులయిన రాయిస్టులనుండి చీలి సామాజిక విప్లవంగా రూపొంది ప్రజల గుండెలలోకి ప్రవహిస్తున్న చరిత్రను పక్షపాత రహితంగా అధ్యయనం చేయవలసి ఉంది. హేతువాద ఉద్యమం రాజకీయ పార్టీ కాకపోవచ్చు. కానీ ఈ ఉద్యమానికి రాజకీయ అవగాహన వున్నది అనే విషయంకూడా ఈమె తెలుసుకొనగలరని ఆశిస్తున్నాను. హేతువాద ఉద్యమం ఆర్థిక దోపిడీని గూర్చి వేలాది సభల్లో, విశ్వ విద్యాలయాలలో కలిగించుతున్న చైతన్యాన్ని గమనించవలసిందిగా కోరుచున్నాను. హేతువాద ఉద్యమం పెరిగే క్రమంలో ఆర్థిక దోపిడీ నిర్మూలనకు బలమైన కార్యక్రమాలను రూపొందించు కొంటుంది. ఏ ఉద్యమమయినా అది పెరుగుతున్న క్రమాన్నిబట్టీ, ప్రజల చైతన్యస్థాయినిబట్టీ దాని కార్యాచరణ పరిధి పెంచుకోవాలి. అందుకే మావో ఇలా అన్నారు. "ప్రజలు చైతన్యవంతులు కాకుండా మనం ముందుకు పోవడానికి ప్రయత్నిస్తే అది "దుందుడు"కు దనం అవుతుంది. ప్రజలు ముందుకుపోవాలని కోరుతూండగా మనం ముందుకుపోకపోతే అది మితవాదఅవకాశవాదం అవుతుంది." ఏ ఉద్యమంమీదయినా చర్చచేసేటప్పుడు ఆ ఉద్యమవ్యూహాన్ని పూర్తిగా అర్థం చేసుకొని చర్చ చేస్తారని లేకపోతే మీ చర్చ పాఠకులను ప్రక్కదారి పట్టించే ప్రమాదముందని తెలుసుకోవలసిందిగా కోరుచున్నాను.

ఇట్లు,

స్వర్ణకుమారి.

---

• దెబ్బలాడేందుకు "సాహసం" లేనివాడూ, పరిగెత్తేందుకు "స్థూలకాయం" అడ్డొచ్చేవాడూ మార్పుకోరడు. —ఎల్బర్ట్‌హుబార్డ్

పెద్దలు చెప్పిన సత్యాలు........

# ఆంగ్లేయుల పరిపాలనలో భారతదేశం

—కారల్ మార్క్స్

---

"అంతర్యుద్ధాలు, దండయాత్రలు, విప్లవాలు, దిగ్విజయాలు కరువు కాటకాలు, ఒకదాని వెన్నంటి ఒకటి వరుసగా సంభవించే వీటన్నిటి ఫలితాలు హిందూస్థానంలో అపరిమితమయిన క్లిష్టతను అత్యంత త్వరిత గతిని కలిగి సర్వ విధ్వంసకరంగా కనపడినప్పటికీ, దాని ఉపరితలంకంటే ఏ మాత్రమూ లోపలికి చొచ్చుకొని పోలేదు. భారత సమాజ చట్రాన్నంతటినీ ఇంగ్లండు విచ్ఛిన్నం చేసింది. కాని ఆ సమాజ పునర్నిర్మాణ చిహ్నాలు ఇంతవరకు ఏమీ కనబడడమే లేదు. తన పూరాతన ప్రపంచాన్ని కోల్పోయి, దాని స్థానే తనకు నూతన ప్రపంచం లభించకపోవడం, హిందువుడిపుడు అనుభవించుతున్న దారిద్ర్య దౌర్భాగ్యానికి ఒక విశిష్టమైన మనో వ్యాకులతను సంధింపజేసి, బ్రిటన్‌చే పరిపాలించబడిన హిందూస్థానాన్ని దాని పురాతన సంప్రదాయ సర్వస్వం నుండీ, దాని పూర్వ చరిత్ర అంతటినుండీ వేరుపడి పోయేటట్లు చేస్తుంది.

అనాదినుండీ ఆసియాలో సాధారణంగా పరిపాలన వ్యవస్థలో ముఖ్యమైన మూడు శాఖలు ఉంటూండేవి. ఆర్థిక శాఖ; అనగా దేశాన్ని దోపిడీ చేయడమూ; యుద్ధశాఖ అనగా విదేశాలను దోపిడీ చేయడమూ, ఇక కడపటిది. పబ్లిక్ వర్క్స్ శాఖ, శీతోష్ణస్థితులూ, ప్రాదేశిక పరిస్థితులూ, అందులోనూ ముఖ్యంగా సహారానుండి, అరేబియా, పర్షియా, ఇండియా తార్తారు దేశాలగుండా అత్యున్నతములయిన ఆసియా పర్వత భూముల వరకు వ్యాపించి వున్నట్టి బ్రహ్మాండములయిన ఎడారి ప్రదేశాలు—మానవ నిర్మితములయిన కాల్వలు, జలాధారాంవల్ల జరిగే సేద్యాన్నే ప్రాచ్య వ్యవసాయ విధానానికి ప్రాతిపదికగా ఏర్పరచాయి. ఈజిప్టు ఇండియాలో లాగానే మెసపుటేమియా, పర్షియా వగైరా దేశాలలో వరద ముంపు వల్లనే భూమిని ఫలవంతం చేయడం జరుగుతూంది.

ఎత్తుగా వున్న మట్టాన్ని వినియోగించుకొని తద్వారా పంట కాల్వలకు నీరు పెట్టుకుంటున్నారు. వీటిని పాడుపుగాను, ఉమ్మడిగాను, వాడుకో

వలసిన ప్రధానావసరం పశ్చిమ దేశాలలో వ్యక్తిగత కృషిని ఫ్లాండర్స్, ఇటలీలలోలాగా, స్వచ్ఛంద సహకార మార్గాన్వేషణకు ప్రేరేపించింది. ఒక నాగరిక స్థాయి తక్కువగానూ, ప్రాదేశిక విస్తీర్ణం అపరిమితంగానూ వున్న కారణాన స్వచ్ఛంద సహకారం రూపొందడానికి అవకాశంలేని ప్రాగ్దేశాలలో ప్రభుత్వ కేంద్రీకృత శక్తియొక్క జోక్యం అవసరమైంది. ఈ కారణంవల్ల ఆసియా ప్రభుత్వాలన్నిటిపైనా పబ్లిక్ వర్క్సును నిర్వహించడమనే ఆర్థిక విధి ఒకటి పడింది. పాల్మయిరా, యెమినీలోని శిథిలాలు, ఈజిప్టు పర్షియా హిందూ స్థానాలలో పెద్దపెద్ద భాగాలు ఒకప్పుడు మహోజ్వలమైన సస్యశ్యామల ప్రాంతాలుగా ఉండి నేడు ఊసర క్షేత్రాలుగా మనకు అగపడుతూన్నవి. విచిత్రమైన వాస్తవానికి, కేంద్ర ప్రభుత్వంపైనే ఆధారపడి నట్టి పంట కాల్వలు, మురుగునీటి వవరులపట్ల ఎట్టి అశ్రద్ధ జరిగినప్పటికీ తక్షణమే క్షీణించి పోయేటట్టి, భూమిని సారవంతంచేసే ఈ కృత్రిమ విధానమే కారణమని తెలియజేస్తుంది. ఒకే ఒక విధ్వంసక యుద్ధం శతాబ్దాల పాటుగా ఒక దేశాన్ని నిర్జనం చేసేసి, దాని నాగరికతనంతటినీ ఎలాగు తుడిచి పెట్టేయగలదో ఈ విషయానికికూడా ఇదే కారణమని తెలియజేస్తుంది."



నిన్నటి కవిత........

# మనిషి —గురజాడ

మనిషి చేసిన రాయి రప్పకి
మహిమకలదని సాగి మొక్కుతు
మనుషులుండే రాయి రప్పల
కన్న కనిష్టం
గాన చూస్తావేల బేలా?

దేవుడెకడో దాగెనంటూ
కొండ కోనల వెతుకులాడే వేలా?
కన్ను తెరచిన కానబడడో
మనిషి మాత్రుడియందు లేడో
యెరిగి కోరిన కరిగి యీడో ముక్తి?

* "గుర్తుంచుకో! అందరికి సుఖాన్ని సాధిస్తే తప్ప ఏ ఒక్కడికీ అది దక్కదు."
—సర్ జగదీశ్చంద్ర బోస్

ఉద్యమ వార్తలు..........

# ఉప్పొంగుతున్న హేతువాద ఉద్యమం

పంగిడిగూడెం : ది. 10-8-84న పంగిడిగూడెంలో భీమడోలు తాలూకా హేతువాదసంఘం ఆధ్వర్యంలో హేతువాద సభ జరిగింది. కార్యక్రమానికి నాగేశ్వరరావు అధ్యక్షత వహించారు. ముఖ్య వక్తగా "మహానాటి కవి" వేమన ప్రసంగిస్తూ భారతదేశంలో కుల మతాలు రూపు మాపబడాలంటే బడుగు, బలహీన, వెనుకబడ్డ మొదలగు ముద్రలు వేయబడ్డ వారంతా సమైక్యమై విజృంభించి పోరాడిన రోజు ఈ దేశంలో తప్పనిసరిగా సమ సమాజం స్థాపింపబడుతుందని అన్నారు. అనంతరం జగదీష్‌గారిచే మ్యాజిక్ ప్రదర్శన జరిగింది.

నాగులపల్లి : ది. 11-8-84న నాగులపల్లిలో వెంకయ్యగారి అధ్యక్షతన జరిగిన హేతువాద సభలో వేమన్నగారు, పాండురంగారావుగారు వేదాల లోనూ, మతాలలోనూ వున్న లోపాలను వివరించారు. అనంతరం జగదీష్‌గారు మంత్రాల మోసాన్ని బయటపెడుతూ ఇంద్రజాల ప్రదర్శన చేశారు.

లక్ష్మీనారాయణపురం : ది. 4-8-84న భీమవరం తాలూకా హేతువాద సంఘం అధ్వర్యంలో లక్ష్మీనారాయణపురంలో జరిగిన హేతువాద సభకు సత్యన్నారాయణగారు అధ్యక్షత వహించారు. ఈ సభలో కార్యకర్తలు స్థానిక సమస్యలు వివరిస్తూ ప్రజలకు మరుగుదొడ్లు నిర్మించుకోవాలని, మురుగు కాల్వలను శుభ్రముగా వుంచుకోవాలని ఉద్బోధించారు. తరువాత జనం పాటలు పాడారు. హిప్నాటిజం ప్రదర్శించబడింది. ముసలయ్య, రాధాక్రిష్ణగార్లు ఈ సభలు విజయవంతం కావటానికి కృషి చేశారు.

జంగంపాడు : ది. 15-8-84న ఇక్కడ జరిగిన స్వాతంత్ర్యోత్సవాలలో భీమవరం హేతువాదసంఘ కార్యకర్తలు పాల్గొన్నారు. యం.యల్.ఏ. బాపిరాజుగారు ముఖ్య అతిధిగా పాల్గొన్నారు. స్వరాజ్యంలో అమాయకులను బాబాలు మోసం చేస్తున్న విధానాన్ని హేతువాదసంఘ కార్యకర్తలు వివరించారు.

వసుంవారిపాలెం: ది. 16-8-84న ఇక్కడ యువకులకు భగత్‌సింగ్ ఆధ్వర్యంలో జనం పాటలు పాడటంలో శిక్షణ ఇవ్వబడింది.

రిపోర్టర్ : భగత్‌సింగ్

శ్రీకాళహస్తి : ది. 26-8-84 ఇక్కడ జరిగిన సభకు శ్రీ ఉన్నీస్ మియా అధ్యక్షత వహించారు. సభలో కె. సుధాకర్, వెనిగళ్ళ సుబ్బారావుగారు ప్రసంగించారు. తొలుత పి. ప్రకాష్ ఉపన్యాసకులను పరిచయం చేశాడు. సభ విజయవంతంగా జరిగింది. రిపోర్టర్ : పి. ప్రకాష్

నిజామాబాద్ : ది. 2-9-84న ఇక్కడ జిల్లా హేతువాదసంఘ ఆధ్వర్యంలో శ్రీమతి భూదేవిగారి అధ్యక్షతన చర్చాగోష్ఠి కార్యక్రమము జరిగింది. తత్వశాస్త్రమంటే ఏమిటి? దానివలన ప్రజలకు కలుగు ప్రయోజనాలను గురించి శ్రీ శివరాజుగారు ఉపన్యసించారు. "ప్రజాకళ"వారు చిత్రకళా ప్రదర్శన ఏర్పాటు చేశారు. జిల్లా హేతువాదసంఘ కార్యదర్శి శ్రీ రామమోహనరావుగారు వందనసమర్పణ చేశారు. రిపోర్టర్ : రాములు

నర్సాపురం : ది. 2-9-84న నర్సాపురం పట్టణంలో దుర్గా లాడ్జిలో జ్యోతిష్యం పేరుతో ప్రజలను మోసం చేస్తున్న టి. యస్. యస్. రాయ్ (కేరళ) కుట్రను హేతువాదసంఘ కార్యకర్తలు బట్టబయలు చేశారు. లక్షరూ॥లు సవాలుచేస్తూ అతను చేస్తున్న మోసాలన్నింటినీ కరపత్రంద్వారా విడుదల చేశారు. ఇది అంతా తెలుసుకున్న జ్యోతిష్యుడు తెల్లవారేసరికే పలాయనం చిత్తగించాడు. మొగల్తూరు, గొంది, ఎలమంచిలి. చించినాడా మొదలగుగ్రామాలనుండి వచ్చిన సభ్యులతో కలిసి రాయ్‌లాంటి పరాన్నభుక్కులైన జ్యోతిష్యుల కుట్రలను కరపత్రాలు, మైకులద్వారా ప్రజలకు వివరించారు. రిపోర్టర్ : వై. వెంకటరత్నం

పన్నశాల : ది. 16-8-84న ఇక్కడి గెస్టు హౌస్‌లో సి. పి. యం. నాయకులు శ్రీ బండారు చంద్రరావుగారి అధ్యక్షతన యం. వాసు ఎం.ఎ; ఝాన్సీగార్ల వివాహం సాంప్రదాయ విరుద్ధంగా ఆదర్శ పద్ధతిలో జరిగింది. గాంధీగారు, దాస్‌గారు, భాస్కరరావుగార్లు వివాహ కార్యక్రమాన్ని గురించి వివరించారు. రిపోర్టర్ : శ్యామ్

## విశ్వ విద్యాలయాలనుండి మతవాద శక్తులను పారద్రోలండి.

ది. 28-8-84 సాయంత్రం 6 గం. హైదరాబాద్ ఉస్మానియా యూనివర్సిటీ ఓల్డు పి.జి. హాస్టల్ "డే" సందర్భంగా ఆంధ్రప్రదేశ్ హేతువాద సంఘం ప్రధాన కార్యదర్శి కత్తి పద్మారావు - "నిరంతర ఆర్థిక సంక్షోభంలో, మత మారణ హోమంలో, ధనస్వామిక దాస్యంలో మ్రగ్గిపోతున్న భరతభూమిని యువకులు విద్యావంతులు అయిన మీరే కాపాడాలి. శ్రామిక విప్లవాలను విజయవంతంచేసే క్రమంలో గ్రామగ్రామం తిరగాలి. ప్రజలలోనుండి విప్లవం తీసుకురావాలి. ప్రజలకై మీరు జీవించాలి. భారతీయ సంస్కృతి పేరుతో అరాచకం సృష్టిస్తున్న మత శక్తులను విశ్వ విద్యాలయాలనుండి పారద్రోలాలి." అని ఉద్ఘాటించారు. ఈ సభలో ప్రముఖ అభ్యుదయ కవి శ్రీ కె. శివారెడ్డికూడా ఉపన్యసించారు.

**చించివాడ :** ది. 14-9-84న చించినాడలో శ్రీ వై. వెంకటరత్నంగారి అధ్యక్షతన చించినాడ డివిజినల్‌గా ఏర్పాటు చేయడమైనది.

ఈ డివిజినల్ సమావేశమునకు తాలూకానుండి శ్రీ డా॥ వరప్రసాద్, శ్రీ కె. గోపాల్‌కూడా వచ్చారు. ఇంతవరకు తాలూకాలో తీసుకొన్న కార్యక్రమాలకు చించినాడ మిత్రుల పూర్తి సహకారం ఉన్న కారణంగానే తాలూకా ఇంత అభివృద్ధి చెందిందని మనం తీసుకొన్న కార్యక్రమాలు విజయవంతం కావడానికి గొంది, నర్సాపురం, చిట్టవరం, యలమంచిలి, పోలవరం, వై.వి. లంక, కాజ తదితరగ్రామాల కార్యకర్తలు సహకరిస్తున్నారని ఇప్పుడు ఈ మిత్రులు అంతా డివిజినల్‌లో పూర్తి బాధ్యతను తీసుకొని గ్రామాలలో అమాయక ప్రజలను, చైతన్యవంతులను చేయవలసిన బాధ్యత మనకుందని వెంకటరత్నంగారు చెప్పారు.

కె. గోపాల్‌గారు మాట్లాడుతూ, "హేతువాదం" మాసపత్రిక పురోభివృద్ధికి ప్రతివారు కృషి చేయాలని కోరారు.

తరువాత ఈ క్రింది కార్యవర్గాన్ని ఎన్నుకోవడం జరిగింది.

| | | |
|---|---|---|
| అధ్యక్షులు | : | సిహెచ్.ఎస్.ఎన్. శ్రీనివాస్ (యలమంచిలి) |
| ఉపాధ్యక్షులు | : | వి. సూర్యనారాయణ |
| " | : | పి. రవికుమార్ (కాజ) |
| కార్యదర్శి | : | డి. గోర్కె |

సహాయ కార్యదర్శులు : బి. నరసింహయ్య
” : కె. బాబ్జి
కోశాధికారి : కె. వెంకటేశ్వరరావు

ఇంకా 15 మందితో కూడిన కార్యవర్గ సభ్యులను ఏకగ్రీవంగా ఎన్ను కోవడం జరిగింది.

నల్గొండ : ది. 22-8-84న నల్గొండకు సమీపముగా వున్న తిప్పర్తి అను గ్రామంలో పశువులు మిక్కుటంగా చనిపోవుటకు కారణం ఒక వ్యక్తి చేస్తున్న చేతబడి కారణమని, పాతబస్తీలోని అమ్మోరు చెప్పిన మాటలను నమ్మి ఆ వ్యక్తి ఇంటిపై దాడిచేసి ఊరు వదలి వెళ్ళవలసిందగా హెచ్చరించటం జరిగింది. భయంతో ఆ వ్యక్తి నల్గొండ హేతువాద మిత్రులను కలిసి తనకు ఏర్పడిన ప్రమాదాన్ని చెప్పుకోగా స్థానిక హేతువాద మిత్రుల బృందం ఒకటి హుటాహుటిన అమ్మోరుగా కొలవబడుతున్న ఆ స్త్రీ వద్దకు పోయారు. ఆ వచ్చింది హేతువాదులని అక్కడివారు చెప్పగా తెలుసుకొన్న అమ్మోరుకు వణుకు పుట్టి, తన దగ్గర మంత్ర తంత్రాలు లేవని తన బ్రతుకు తెరువుకు ఆడిన నాటకమని బహిరంగంగా ఒప్పుకోవటం జరిగింది. ఆ సమయంలో అక్కడ ఉన్న జన సమూహం అమ్మోరిని ఇక నుండి మాయ వేషాలు వేస్తే దేహశుద్ధి జరుగుతుందని హెచ్చరించారు. అనంతరం ఆ వూరి ప్రజలు నల్గొండ హేతువాద మిత్రులకు, మర్మాన్ని ఛేదించినందుకు కృతజ్ఞతలు తెలుపగా తనను దేహశుద్ధినుండి రక్షించినందుకు చేతబడి చేస్తున్నాడనే ఆరోపణ చేయబడ్డ వ్యక్తి హేతువాద మిత్రులకు అభినందనలు తెలిపాడు రిపోర్టర్ : వెంకట్

## మత్తయ్య మాస్టారుకు జోహార్లు

భీమడోలు : ది. 12-9-84 మత్తయ్య మాస్టారుగా పదిమందికి తెలిసిన భీమడోలు హేతువాదసంఘ సభ్యులయినటువంటి దాసె మత్తయ్య హేతువాద ఉద్యమాన్నే తలుస్తూ 11-9-84న మరణించారు. మాస్టారు మరణ వార్త వినగానే భీమడోలు హేతువాద మిత్రులంతా మత్తయ్యగారి ఇంటికివెళ్ళి ఏ ఉద్యమం కోసమయితే మాస్టారు మత్తయ్య చివరి క్షణం వరకు అవిశ్రాంతంగా కృషి చేశారో ఆ ఉద్యమ లక్ష్యాలను వివరించి మత పరమయిన కర్మకాండలు లేకుండా మత్తయ్య భౌతిక కాయాన్ని మహిళా

కార్యకర్తలతో కలిసి శ్మశాన వాటికకు తీసుకువెళ్ళి మహిళలు శ్మశాన వాటికలోకి ప్రవేశించరాదనే మూఢ విశ్వాసాన్ని ఛేదించి మత్తయ్య మాస్టారుకు అభ్యుసారిగా జోహారులు అర్పించిన సంఘటన భీమడోలు తాలూకాలో సంచలనం సృష్టించింది. ఈ సందర్భంగా భీమడోలు తాలూకా హేతువాద సంఘం దాసే మత్తయ్యగారి కుటుంబానికి సంతాపం తెలియజేస్తూ మత్తయ్య మాస్టారుకు జోహారులర్పిస్తుంది. రిపోర్టర్ : ఎం. వేమన్న

నరసరావుపేట : ది. 2-9-84న సాయంత్రము 6 గంటలకు స్థానిక మిత్రులు హేతువాద సంఘము నిర్వహించు "స్టడీ సర్కిల్"కు సమావేశమయ్యారు. అధ్యక్షులుగా శ్రీ పూర్ణా వ్యవహరించారు. "మానవ జీవిత లక్ష్యం" అనే విషయంపై మిత్రులను ప్రసంగించమని శ్రీ నశీర్ కోరగా, శ్రీయుతులు ఎస్. రాములు, కె. సుబ్బారావు, జె. శ్రీనివాసరావు, జె.వి. రావు, కె. బాలాజీ, అల్లాభక్షు, భాషా, కాశిరావు, వెంకటేశ్వర్లు, పరశురామ్, రాజు మొదలగువారు ప్రసంగిస్తూ సమసమాజ నిర్మాణానికి కృషి చేయటమే మానవ జీవిత లక్ష్యంగా వుండాలని అన్నారు. చివరగా అధ్యక్షులు అందరి అభిప్రాయాలను సమన్వయపరుస్తూ మన స్వేచ్ఛ ఇతరులకు నష్టము కలుగజేయకుండా వుండాలని అందరూ సంతోషముగా వుండుటకు హేతువాద మిత్రులందరూ నిర్విరామ కృషిచేయాలని అన్నారు.

రిపోర్టర్ : జె.వి.ఆర్.

ది. 16-9-84న ఏర్పాటు అయిన "స్టడీ సర్కిల్"కు శ్రీ యస్.వి. రావు అధ్యక్షత వహించగా ఈ సమావేశంలో "సోషలిజం" అను అంశంపై తొలుత శ్రీ బి.వి.కె. పూర్ణానందం విషయాన్ని విశదీకరిస్తూ చర్చను ప్రారంభించారు. ఈ అంశముపై మిత్రులు సుబ్బారావు, మల్లిఖార్జున, కె. బాలాజీ, జె.వి.ఆర్., బి. బాలజీ (బాలు), అల్లాభక్షు, శాయి, చైతన్య మొదలగు వారు మాట్లాడారు. ఈ చర్చలో ఇంకా మిత్రులు షరీఫ్, ముజాఫర్, క్రాంతి (సుబ్రహ్మణ్యం) మొ॥రు పాల్గొన్నారు. అనంతరం శ్రీ ఎస్. వి. రావుగారు సోషలిజంయొక్క ప్రాధాన్యతను, ప్రపంచానికి దాని అవసరాన్ని విశ్లేషిస్తూ ప్రసంగించారు. చివరిగా "స్టడీ సర్కిల్ కన్వీనర్ శ్రీ బాలు ముగింపు మాటలతో కార్యక్రమం రాత్రి 9 గం. ముగిసినది. రిపోర్టర్ : బాలు

ది. 22-9-84న జరిగిన నరసరావుపేట హేతువాద మిత్రుల సమావేశం శ్రీ బి.వి.కె. పూర్ణానందం అధ్యక్షతన జరిగింది. ఈ సమావేశంలో

హేతువాదం పత్రిక సబ్ ఎడిటర్ శ్రీ సయ్యద్ నశీర్ అహమ్మద్ న్యాయవాద వృత్తిని స్వీకరించిన సందర్భంగా అభినందనలు తెలుపుతూ మిత్రులంతా ప్రసంగిస్తూ "మిత్రులు నశీర్ న్యాయవాద వృత్తిలో నిజాయితీగా న్యాయం కోసం పోరాడవలసింది"గా కోరారు. శ్రీ యస్.వి. రావుగారు న్యాయవాద వృత్తిలోనున్న సాధక బాధకాలను వివరిస్తూ న్యాయవాద వృత్తిలోవుండే సహజమయిన బలహీనతలకు అతీతంగా ఉంటూ సామాజిక న్యాయంకోసం న్యాయబద్ధంగా పోరాడవలసిందిగా సలహా ఇచ్చారు. మిత్రుల అభినందనలకు కృతజ్ఞతలు తెలుపుతూ శ్రీ నశీర్ "తనకు చేతనయినంతలో తనయొక్క శక్తియుక్తులను వినియోగిస్తూ, న్యాయంకోసం పోరాడగలనని, తనకు అత్యధికంగా సంపాదించాలనే ఆశ లేదని, సామాజిక న్యాయంకోసం న్యాయబద్ధమయిన పోరాటం న్యాయస్థానంలో న్యాయవాదిగా విజయవవతంగా కొనసాగించగలననే ఉద్దేశ్యంతో తాను చేస్తున్న ఉద్యోగానికి రాజీనామా ఇచ్చి ఈ న్యాయవాద వృత్తిలోనికి ప్రవేశించానని" అన్నారు. చివరిగా ఈ అభినందనసభ కన్వీనర్‌యినటువంటి చైతన్య ముగింపు మాటలతో సభ ముగిసినది. రిపోర్టర్ : చైతన్య

## ప్రజాస్వామ్యానికి సెక్యులరిజానికి సమాధికడుతున్న నేటి ప్రభుత్వాలు

### పొన్నూరు హేతువాద సభలో వక్తల ఉద్ఘాటన :

మనదేశంలో ప్రజాస్వామ్యం సెక్యులరిజం అనేవి శుష్క నినాదాలుగా మిగిలిపోతూ వున్నాయి. పాలకులు మత విద్వేషాన్ని రెచ్చగొట్టి రాజకీయ కక్షలకు సాధనంగా వాడుకొంటున్నారు. హైదరాబాదులో జరుగుతున్న మత మారణహోమంలో దగ్ధమవుతున్న ఎందరో అమాయకుల రక్తం ఈ దేశంలో భగ్నమవుతున్న సెక్యులరిజాన్ని గూర్చి ఘోషిస్తోంది. ఒక మనిషిని వేరొక మనిషి, ఒక జాతిని వేరొకజాతి పీడించే సాంఘిక ధర్మంగా మత వ్యవస్థ చలామణి అవుతోంది. పంజాబ్ మారణహోమంలో హతులైన వేలాదిమంది భారతీయులు ప్రజాస్వామ్యంయొక్క స్వరూపానికి నిదర్శనం. భారతదేశంలో నలుమూలలా రగులుతున్న మత కల్లోలాలు వాటి వెనుక వున్న రాజకీయ శక్తుల కుతంత్రాన్ని విప్పి చెబుతున్నాయి.

మానభంగాలు, మానవ దహనాలు రక్షించేవారి భక్షించే స్వేచ్ఛను ప్రకటిస్తున్నాయి. ఈ దుర్మార్గాన్ని, దౌష్ట్యాన్ని, ఈ దోపిడీ విధానాన్ని

ప్రజలు సంఘటితులై ప్రజా ఉద్యమాలు నిర్మించాలని పొన్నూరు తాలూకా హేతువాదసంఘం ఆధ్వర్యంలో జరిగిన సభలో వక్తలు ఉద్ఘాటించారు.

సెప్టెంబరు 23న పొన్నూరులో జరిగిన హేతువాదసంఘ బహిరంగ సభకు గుంటూరు జిల్లా హేతువాదసంఘ అధ్యక్షులు శ్రీ అవుతు సుబ్బారావు గారు అధ్యక్షత వహించారు. దాదాపు 2000మంది హాజరయినారు. తొలుత శ్రీ యస్. వి. రావు ఆం.ప్ర. హేతువాదసంఘం గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేశారు. తరువాత సెక్యులరిజంమీద ప్రసంగిస్తూ ఈనాడు మత కలహాలతో భారతదేశం తగలబడి పోతుందని రాజకీయ నాయకులు మతాలను స్వప్రయోజనాలకు ఉపయోగించుకుంటున్నారని, ఇది దేశ సమగ్రతకు ప్రమాదమని, ఏకాత్మతా యజ్ఞంలాంటి కార్యక్రమాలు మత కలహాలకు మూలమని వివరించారు. తదుపరి యువ న్యాయవాది, హేతువాదం పత్రిక సబ్ ఎడిటర్ శ్రీ నశీర్ అహమ్మద్ ఇస్లాం-శాంతి అను విషయంపై ప్రసంగిస్తూ ఇస్లాం అంటే శాంతి అను అర్థం ఉన్నా ఇస్లాంమతం మాత్రం "రక్తంలో పుట్టి పెరిగింద"ని ఇది పేరుకు శాంతి మతమయినా అశాంతినే ఎక్కువగా ప్రోత్సహిస్తుందని, చరిత్రను పరిశీలిస్తే తెలుస్తుందన్నారు. ఇస్లాం మతోద్ధారకులుగా కీర్తించబడుతూన్న ముల్లాలు వివిధ సందర్భాలలో పలికిన ఉద్రేకపూరితమయిన ప్రసంగాలలోని మాటలను ఉటంకిస్తూ ఇది శాంతి మతమా? అశాంతిమతమా? ఆలోచించవలసిందిగా విజ్ఞప్తి చేశారు. మత కలహాల్లో ఎందరో బలయిపోతే ఎంతమంది ముస్లింలు మరణించారు? అని ప్రశ్నిస్తారే తప్ప, "ఎంతమంది మనుషులు" మరణించారన్న ప్రశ్న కలగకపోవటం బాధాకరమైన విషయం అన్నారు. మనిషి మతస్తునిలా కాకుండా మనిషి మనిషిగా బ్రతకటానికి మానవత్వాన్ని ప్రతిష్ఠించటానికి హేతువాద ఉద్యమం కృషి చేస్తుందంటూ తన ప్రసంగం ముగించారు. శ్రీ దేవరపల్లి మస్తాన్‌రావు "కుల వ్యవస్థ" మీద మాట్లాడుతూ మన దేశంలో కుల ప్రాతిపదికమీద ప్రజలు ఎన్ని విధాలుగా చీలిపోయి ఉన్నారో, కులం సృష్టిస్తున్న కలహాలు ఎంత తీవ్రంగా యున్నాయో, కుల ప్రాతిపదికమీద రాజకీయాలు ఎలా నడుస్తున్నాయో మొదలగు వివరాలు తెలిపారు. చివరిగా శ్రీ కత్తి పద్మారావుగారు ఉపన్యసిస్తూ నేటి ప్రభుత్వాలు మత విద్వేషాన్ని రెచ్చగొట్టుతూ రాజకీయ కక్షలను సాధించుకోవటానికి మతాలను ఉపయోగించుకుంటున్నాయని, హైదరాబాద్‌లోను, పంజాబ్‌లోను జరుగుతున్న మత మారణ హోమాలు ఇందుకు నిదర్శనలని, ఈ మత కుల ఘర్షణలకు వ్యతిరేకంగా పెద్ద ఎత్తున ప్రజా ఉద్యమాలు

నడవవలసిన అవసరం వుందని అందుకు హేతువాదసంఘం కార్యక్రమాన్ని రూపొందిస్తున్నదని వివరించారు.

తొలుత గుంటూరు జిల్లా కార్యదర్శి హేతుశ్రీగారు ఉపన్యాసకులను స్టేజిమీదకు ఆహ్వానించారు. రాష్ట్ర కార్యదర్శి శ్రీ వల్లంపట్ల ప్రారంభ గేయంతో సభ ప్రారంభమయింది. దోనేపూడి మోహన్‌ప్రసాద్‌గారు తాను రచించిన "దండోరా" గేయాలు స్వయంగా పాడి వినిపించారు. పాండు రంగారావుగారి హిప్నాటిజం కార్యక్రమంతో సభ ముగిసింది. రి॥ మురళి

## మత కలహాలకు వ్యతిరేకంగా ప్రజలను సమీకరించాలి

ఈనాడు హైదరాబాదులో జరుగుచున్న మత సంఘర్షణల వెనుక వున్న విచ్ఛిన్నకర శక్తులను ప్రభుత్వం నిష్పక్షపాతంగా శిక్షించాలని, ఈ సంఘర్షణలకు మూలమవుతున్న సంఘాలను, సంస్థలను గుర్తింపు రద్దు చేయాలని, మత సంస్థలు ఉద్రేకపూరితంగా, ఉద్వేగపూరితంగా జరుపు తున్న ఊరేగింపులను, ఉరుసులను, ఉత్సవాలను మొత్తంగా నిషేధించే బిల్లు పెట్టాలని ఆంధ్రప్రదేశ్ హేతువాదసంఘం విజ్ఞప్తి చేస్తూవుంది.

ఈ విధమయిన నిషేధపు ఉత్తర్వు ప్రభుత్వం ఇవ్వకపోతే ఆంధ్ర ప్రదేశ్ హేతువాదసంఘం పెద్ద ఎత్తున ప్రజాస్వామ్య సెక్యులర్ శక్తుల సహకారంతో ప్రజలను సమీకరించి మత సంఘర్షణా నిర్మూలనకై ప్రజా ఉద్యమాన్ని నడపాలని తీర్మానించింది.

## ఉప్పాడ కొత్తపల్లి హేతువాదసంఘ నిర్మాణం

ది. 9-9-84న ఉప్పాడ కొత్తపల్లిలో జరిగిన హేతువాద మిత్రుల సమావేశం ప్రధానకార్యదర్శి శ్రీ జె. పద్మారావు అధ్వర్యంలో జరిగింది. ఈ సమావేశంలో ఉప్పాడకొత్తపల్లి శాఖ కార్యవర్గం ఈ క్రిందివారితో ఏర్పడింది.

అధ్యక్షుడు : శ్రీ రామకృష్ణ సెక్రటరీ : శ్రీ రావు వెంకటరంగనాయకులు

సహాయ కార్యదర్శి : శ్రీ గుండా నాగేశ్వరరావు

కార్యవర్గ సభ్యులు :

శ్రీ రావు సత్యన్నారాయణ, శ్రీ చందనాల అప్పారావు,
శ్రీ బస్వా సత్యారావు, శ్రీ బస్వా బలరామకృష్ణ,
శ్రీ బండి నాగేశ్వరరావు, శ్రీ గంట్రోతు గౌరిశంకరరావు,
శ్రీ గడ్డి వెంకటరమణ, శ్రీ మొండు సత్యన్నారాయణ,
శ్రీ కోడెదాసు సుబ్బారావు, శ్రీ పురంశెట్టి నరసింహమూర్తి,
శ్రీ జె. రామారావు, శ్రీ భాగవతుల వెంకటేశ్వరరావు,
శ్రీ జోతుల ప్రభాకరరావు, శ్రీ గుబ్బల నారాయణ.

# ప్రజావాణి (గోడ పత్రిక)

పొన్నూరు హేతువాదసంఘం ఆధ్వర్యంలో "ప్రజావాణి" పేరుతో గోడ పత్రిక దిన పత్రికగా నడపబడుచున్నది. రాష్ట్రంలోని హేతువాద సంఘాలు అవకాశమున్నచోట ఈ పద్ధతిలో పత్రికలు నడపటానికి ప్రయత్నించ గలరని ఆశిస్తున్నాము. —(ఎడిటర్)

---

## నమూనా గోడపత్రిక (అట్ట చివరిపేజీలో ముద్రించబడినది)

ఆంధ్రదేశంలో ఈనాడు కుహనా రాజకీయతంత్రం చాలా గొప్పగా నడుస్తూ వుంది. నిరంతరం నియంతృత్వ పోకడలతో పచ్చి నియంతగా వ్యవహరించే రామారావు, తనకంటే వెయ్యిరెట్లు నియంతగా రూపొందిన ఇందిరాగాంధీచేత రాజభవన్ ముందు అధికార పీఠంనుండి తోయబడి బిల్ల బీటుగాపడ్డాడు. లేచి ప్రజాస్వామ్యం రాజభవన్‌ముందు నగ్నంగా హత్యచేయబడిందని అరుస్తూ ఆంధ్రప్రదేశ్ వీధులవెంట తిరిగి అల్లరిచేశాడు. ఇందిరా గాంధీ ఏనాడు ప్రజాస్వామికంగా వ్యవహరించింది కాబట్టి, పశ్చిమబెంగాల్, కాశ్మీర్, సిక్కిం ఎన్ని ఉదాహరణలులేవు రాజకీయకుతంత్రానికి? రామారావు మాత్రం తక్కువా? కాకి వస్త్రాలతో ఎన్నికల ప్రచారం చేసిన రామారావు కాషాయ వస్త్రాలు ధరించి, ఏకకుండల ధారణచేసి కొబ్బరికాయ నీళ్ళతో కాళ్ళు కడిగించుకుంటూ, ఎం.ఎల్.ఎ.లను పురుగులకంటే హీనంగా చూస్తూ తన కుటుంబం మొత్తానికి రాజకీయ పెత్తనం అందజేసి ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని హతం చేయలేదా? ఈ నాదెండ్ల భాస్కరరావు అనే నక్కను చేరదీసి ఆ జిత్తులన్నీ ఈతడు నేర్చుకోవటానికి ప్రయత్నించలేదా?

ఇందిర, భాస్కరరావు, రామారావు అందరూ ప్రజాస్వామ్యానికి ద్రోహులే. కులమత ప్రాంతీయ ధోరణులను రెచ్చగొట్టి, తమ పీఠాలు కాపాడుకోవటానికి ప్రయత్నించే రాజకీయ కుట్రదారులే. వీరికోసం ప్రజలు సంఘర్షించుకోవటం, చంపుకోవడం అనాలోచితం. వీరి గుట్టును రట్టుచేసి నిరంతర ఆర్థిక పీడనతో కొట్టుమిట్టాడుతున్న సమస్యలకోసం ప్రజలనుండి నిజమైన ఉద్యమాలు నిర్మాణం చేయాలి. నిజమైన మరో స్వరాజ్యాన్ని నిర్మించుకోవాలి. లేకుంటే ఈనాడు అసెంబ్లీలో అధికార పీఠంకోసం గుద్దులాడుకుంటున్న భూస్వాములు, పెట్టుబడిదారులు, గూండాలు, రౌడీలు, సారా కాంట్రాక్టర్లు, హంతకులు, దోపిడీదార్లు ఇందిరాగాంధీ మద్దతుతోనో, రామారావు మద్దతుతోనో మరలా రాజ్యానికి వస్తారు,

జాగ్రత్త....జాగ్రత్త....జాగ్రత్త....ఈ "ప్రజావాణి"ని మరువకండి.

ఇట్లు! హేతువాద సంఘం, పొన్నూరు 14-9-84.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA105M243 |
| పుస్తకం పేరు | హేతువాదం |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | sowmya |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | S.Lakshmi |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |